# మహోత్యాగి
# మద్దూరి అన్నపూర్ణయ్య
# జీవిత చరిత్ర

రావినూతల శ్రీరాములు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.



మద్దూరి అన్నపూర్ణయ్య

జననం : 20-3-1899

మరణం : 10-9-1954



మద్దూరి వెంకటరమణమ్మ

# శతజయంతి సమితి పక్షాన రెండు మాటలు

నిష్కళంక దేశభక్తులు, సోషలిస్టు ఉద్యమ పితామహులు మద్దూరి అన్నపూర్ణయ్య శతజయంతి ఉత్సవ సమితి, 1999 జనవరిలో ఏర్పడింది. మార్చి నెలలో విజయవాడ, రాజమండ్రి, హైదరాబాద్‌లలో శతజయంత్యుత్సవాలు వైభవంగా ముగిశాయి. రాష్ట్ర సమాచార శాఖామాత్యులు శ్రీ తమ్మినేని సీతారాంగారు సమితి అధ్యక్షులుగా నుండటమే గాకుండా మాకు అన్నివిధాల చేదోడువాదోడుగానున్నారు.

తరువాత నెలలో విశాఖపట్నం, కాకినాడ, పడాపురం, పెద్దాపురం, కొమరిగిరి (జన్మస్థలం)లలో కూడా శతజయంతి సభలు జరిగినవి. అన్నపూర్ణయ్య గారిని గూర్చి విశేష సంచికను ప్రచురించాం.

అన్నపూర్ణయ్య గారి జీవిత చరిత్ర రచన శతజయంతి కార్యక్రమాలలో ఒకటి. ఇందుకు పూనుకున్న శ్రీ రావినూతల శ్రీరాములు, విషయసేకరణలో చాలా శ్రద్ధ తీసికొని దీనిని సర్వజన సమ్మతముగ రాశారు. దీని ముద్రణకు దోహదం చేసిన ప్రెస్ అకాడమీ అధ్యక్షులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారికి సమితి పక్షాన కృతజ్ఞతలు.

ఈ రచన ముద్రణకు మార్గం చూపిన ప్రెస్ అకాడమీ మాజీ అధ్యక్షులు శ్రీ కె. శ్రీనివాసరెడ్డి గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

173, లలితానగర్,
హైదరాబాదు–44.

**ఎ.వి.కె. చైతన్య**
ప్రధాన కార్యదర్శి
మద్దూరి అన్నపూర్ణయ్య
శతజయంతి సమితి.

# కృతజ్ఞతలు

ఈ రచనకు నన్ను పురికొల్పిన ప్రాణమిత్రులు శ్రీ ఎ.వి.కె. చైతన్య గారికి అనేకవిధాల తోడ్పడిన శ్రీ మద్దూరి జయరామ్, రావెల సోమయ్య, శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు, గౌతమీ గ్రంధాలయం ఉద్యోగులకు, వీరేశలింగం టౌన్‌హాలు నిర్వాహకులు శ్రీ వై.ఎస్. నరసింహారావు గార్లకు ప్రచురణకు దోహదపడిన ప్రెస్ అకాడమీ అధ్యక్షులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గార్లకు హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ గ్రంథం ప్రచురించటానికి అంగీకరించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

- రచయిత

# నమస్కృతి

"స్వారాజ్యం అంటేనూ, ఆంధ్రరాష్ట్రమంటేనూ పదవుల పంపకమే కామోసు"!

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన ఐదు రోజులకే "వెలుగు" పత్రికలో అమృతరావు చేసిన వ్యాఖ్య ఇది. "కలం చిందులు" శీర్షిక క్రింద అమృతరావు చేసే వ్యాఖ్యలను ఆ రోజుల్లో జనం ఆసక్తిగా చదువుతుండేవారు.

స్వాతంత్ర్యం వస్తూనే ఎవరికి ఏ పదవులు వస్తాయో అని రాజకీయ, తదితర వర్గాలలో సాగిన ఊహాగానాలపై అమృతరావు కలం చిందులు తొక్కింది. స్వాతంత్ర్యం వచ్చేదాకా నలుగురు కూడి మాట్లాడుకొంటుంటే; నాయకుల, కార్యకర్తల త్యాగాలూ వారి కుటుంబాలు పడిన కష్టాలూ ప్రస్తావనకు వస్తుండేవి. 1947 ఆగష్టు 15 తరువాత సంభాషణలు పదవుల పంపకం మీదకు మళ్లి, త్యాగాలూ, కష్టాలూ మరుగున పడ్డాయి.

అమాయకత్వం అనిపించే "కామోసు", వ్యాఖ్య చేసిన "అమృతరావు" అసలు పేరు మద్దూరి అన్నపూర్ణయ్య గారు. పదవీ వ్యామోహాన్ని ఆయన వెటకరించారేగాని పదవులు వద్దనలేదు. ఎన్నికలలో పోటీచేసి ఓడిపోయారు. ఓడిపోయి, రాజకీయసన్యాసం చేశారు. స్వాతంత్ర్య యోధుల త్యాగాలను మరచి, ఇతరేతర 'యోగ్యత'లను గణనలోకి తీసుకొంటున్న కాలంలో ఆయన చేయగలిగింది అదే.

"అన్నపూర్ణయ్యగారెవరు?" అని ఎవరైనా ప్రశ్నిస్తే ఆశ్చర్యపడనక్కరలేదు. ఆయనెవరో కొత్తతరాలకు చెప్పడానికి ఇంతకాలం ఎవరం ప్రయత్నించాము గనుక?

భార్యాబిడ్డలను పోషించవలసిన బాధ్యతను గూడా దైవానికి వదిలేసి దేశంకోసం తన 55 సంవత్సరాల జీవితంలో ఐదోవంతు కాలానికి పైగా కారాగృహంలో గడిపిన మహాత్యాగి అన్నపూర్ణయ్యగారు.

1922 లో "కాంగ్రెస్" పత్రికతో కలానికి పదులుపెట్టినది మొదలు "నవశక్తి", "జయభారత్", "వెలుగు" పత్రికలలో స్వాతంత్ర్యానికి పూర్వం స్వాతంత్ర్యం తరువాత కూడా నిర్భయంగా కలాన్ని నడిపిన ప్రథమ శ్రేణి పత్రికా రచయిత అన్నపూర్ణయ్యగారు.

తామంతా దేశంకోసం పడిన పాట్లన్నీ ఫలించి "అన్యాయములన్నీ అడుగంటి పోతాయి, జాతిభేదాలన్ని సస్తాయి, సస్తాయి, కులము గిలములన్ని గోతిలో పడతాయి, ఆస్తిపాస్తులన్ని అందరివౌతాయి, అందరు సమముగ అనుభవించొచ్చండి" అని సామ్యవాద స్వప్నాలుకన్న సమరయోధుడు అన్నపూర్ణయ్యగారు.

అల్లూరి సీతారామరాజు, నేతాజీ సుభాష్ చంద్రబోస్ లాంటి విప్లవ సేనానులతో; గాంధీజీ, జయప్రకాశ్ నారాయణ్ అలాంటి జాతీయ నాయకులతో భుజం భుజం కలిపి తిరిగిన అగ్రశేణి నాయకుడాయన.

ఆయన జర్నలిస్టు, ఆయన కవి, ఆయన నవలాకారుడు. (ఆయన రాసిన 'అక్క' నవల అలభ్యం).

పుచ్చలపల్లి సుందరయ్య గారు, ప్రకాశం పంతులుగారు, ఆచార్య రంగాగారు, పి.వి.జి. రాజుగారు వీరందరికి అన్నపూర్ణయ్యగారి మీద అభిమానం ఉండేది. ఐతేనేమి, స్వాతంత్ర్యానంతర రాజకీయాలలో ఆయనకు స్థానం లేకుండా పోయింది. అసెంబ్లీ ఎన్నికలలో రాజమండ్రి నుంచి పోటీ చేస్తే, ఓడిపోయారు. స్వతంత్ర భారత రాజకీయాలకు ఆయన పనికిరాడని వోటర్లు అభిప్రాయపడుంటారు! (రెండవ ప్రపంచ యుద్ధంలో ఇంగ్లాండ్‌కు అద్భుత విజయాలను సాధించిన సర్ విన్‌స్టన్ చర్చిల్‌ను యుద్ధానంతరం జరిగిన ఎన్నికలలో – అక్కడి ప్రజలు పక్కకు తప్పించి అట్లీకి పట్టం కట్టారు. కాని అందుకు కారణాలున్నాయి. ఇక్కడ పరిస్థితులు వేరు. మన రాజకీయాలు విలక్షణమైనవి)!

కడచిన సంవత్సరం ఎవరో కొందరు పుణ్యాత్ములు పూనుకొని మద్దూరి అన్నపూర్ణయ్యగారి శతజయంతి ఉత్సవాలను జరిపించారు. చాలాయేళ్ల తరువాత ఆ మహనీయుడిని ఒకసారి తలచుకునే మహదవకాశం తెలుగువారికి అలా కలిగింది. ఆయనను గురించి ఒక చిరుగ్రంథం వెలువరించాలన్న ఆలోచనకు కూడా అదే కారణమైంది.

స్వాతంత్ర్యోద్యమంలో అసాధారణమైన త్యాగాలు చేసి, అనంతరం జాడతెలియకుండా పోయిన ఇంకా ఎందరో మహనీయులవలెగాక అన్నపూర్ణయ్యగారి జీవిత చరిత్ర ఇప్పుడు వెలుగుచూస్తున్నది. గొప్ప సంగతి. ఈ భాగ్యాన్ని దక్కించుకున్న పుణ్యాత్ముడు శ్రీ రావినూతల శ్రీరాములుగారు. ప్రకాశం, కల్లూరి సుబ్బారావు, గుత్తి కేశవపిల్లె, పప్పూరి రామాచార్యుల లాంటి ఉద్దండులను గురించి రాసి, కొత్త తరాలకు వారి ఘనతను చాటి చెప్పిన సహృదయుడాయన.

దేశభక్తులను గురించి, త్యాగధనులను గురించి రాయడం శ్రీ రాములు గారికి ఇష్టమైన సేవ. అలా రాయడం ఆయనకేదో అలౌకికానందాన్ని కలిగిస్తుంది. అక్షరమక్షరంలో నాటి త్యాగమూర్తుల పట్ల ఆయనకు గల గౌరవాభిమానాలు వ్యక్తమవుతుంటాయి. అన్నపూర్ణయ్యగారి జీవిత చరిత్ర రచనకూడా అదే విధంగా సాగింది. పుస్తకం చిన్నదైనా అందుకు చేరిన కొన్ని సంఘటనల చిత్రణ అత్యంత ఘనమైనది.

అన్నపూర్ణయ్య గారు జైల్లో మగ్గుతూంటే, ఆయన కుటుంబం కటిక దరిద్రాన్ని అనుభవించింది. ఆయన భార్య రమణమ్మగారు మహాసాధ్వి. భర్తకు ఒక కార్డుకొని ఉత్తరం రాయడానికి కూడా డబ్బులు ఉండేవి కావట. తన దీనావస్థను సూచిస్తూ భర్తకు రాసిన రెండు పంక్తులను శ్రీ రాములు గారు తన గ్రంథంలో పేర్కొన్నారు. కంటతడి తెప్పించే వాక్యం ఇది.

"ఏ దినం మీరు కార్డుకోసం ఎదురుచూస్తారో ఆ దినం ఈ కార్డును చూసి తృప్తిపడండి".

తేదీ వేయకుండా అలా ఈ కార్డు రాశారట.

భర్త జైల్లో ఉన్నాడు. ఫలానా అప్పుడు తిరిగి వస్తాడన్న పూచీ లేదు. ఆడపిల్లకు పెళ్లీడు వచ్చింది. అత్యంత నిరాడంబరంగా బిడ్డకు పెళ్లిచేసి, బాధ్యత నెరవేరిందన్న తృప్తితో తనువు చాలించింది రమణమ్మగారు. జైల్లో ఉన్న అన్నపూర్ణయ్యగారు వార్తవిని కుంగిపోయాడు. తన ఆవేదనకు అక్షరాకృతి కల్పించాడు –

చేతకాసులేదు, చెరసాలలో భర్త...
పిల్ల పెళ్లికూడ పెనిమిటి లేకనే
నీవె చేయవలసె నీలవేణి
జనుల సాయమైన ధనసహాయమైన
లేకపోయె నీకు లేమిగల్గి
వలదు నా బాధ పరమశత్రువుకైన...
పడితి విన్నిపాట్లు నాదువలన
దొసగు లెన్నియొ సేసిన దుష్టమతిని
నేరమెంచక క్షమియించు నెలత నన్ను
క్రూరవిధి నిన్ను నన్వీడి కోర్కెమింగె
బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబ నగుచు...

గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి తరువాత, పత్రికలో రాసినందుకు జైలుకు వెళ్లి, దాదాపు పుష్కరకాలం కారాగార క్లేశాన్ని అనుభవించిన మరో జర్నలిస్టు తెలుగునాట బహుశ అన్నపూర్ణయ్య గారే కావచ్చు. స్ఫూర్తిదాయకమైన రచన చేసినందుకు శ్రీ రావినూతల శ్రీరాములు గారికి, ప్రచురిస్తున్న విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌కు అభివందనం.

పొత్తూరి వెంకటేశ్వరరావు

★ ★ ★

# ఇందులో...



* * *

# మహోత్యాగి మద్దూరి అన్నపూర్ణయ్య

## ప్రశస్త గోదావరీ తీరం

*భరత ఖండంబు చక్కని పాడియావు*
*హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ*
*తెల్లవారను గడుసరి గొల్లవారు*
*పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.* – చిలకమర్తి లక్ష్మీ నరసింహం

మా కొద్దీ తెల్ల దొరతనము
మా కొద్దీ తెల్ల దొరతనము! దేవా !
మా కొద్దీ తెల్ల దొరతనము
మా ప్రాణాలపై పొంచి–మానాల హరియించె మాకొద్దీ...
(గరిమెళ్ల సత్యనారాయణ)

స్వాతంత్ర్య సమర కాలంలో యావదాంధ్ర జాతిని ఉర్రూతలూగించిన పై కవితలు పవిత్ర గోదావరి ఒడ్డున గల రాజమహేంద్రి లోనే ఆవిర్భవించాయి.

"గంగా స్నానం–తుంగా పానం" ఇది రాయలసీమలో తరచూ వినబడే నానుడి. గంగా నదిలో స్నానం, తుంగభద్రానదీ జలపానం పుణ్యప్రదాలుగా ప్రజలు భావిస్తారు.

దక్షిణ గంగగా ఎన్నబడిన గోదావరి స్నాన పానాలకు రెండింటికీ తగివున్నట్టు పలువురి విశ్వాసం.

గోదావరి జలం త్రాగిన వానికి సాహిత్యం, కావేరి జలపానం చేసిన వ్యక్తికి సంగీతం అబ్బుతాయనేది మరొక నానుడి.

ఏది ఏమైనా 11 వ శతాబ్దిలో ఆదికవి నన్నయ్యతో ప్రారంభమైన రాజమహేంద్రి వైశిష్ట్యం ఈనాటికీ గోచరం కావడం నిర్వివాదం.

ఒక్క సాహితీ రంగమే కాదు. సకల కళలకు కాణాచి రాజమహేంద్రి.

ఇరవయ్యవ శతాబ్ది రాజమహేంద్రి ఘనతను ఇనుమడింప జేసింది.

"ఆంధ్రభీష్మ" న్యాపతి సుబ్బారావుగారి జన్మస్థలమిది. "యుగకర్త" కందుకూరి వీరేశలింగం గారికిది కార్యరంగం. "ఆంధ్రకేసరి" ప్రకాశం విద్యార్థి తొలి యౌవన దశలకు రంగస్థలి. "ఆంధ్రా బెర్నార్డుషా" చిలకమర్తి కవి ఆవాసంతో పునీతమయింది.

ప్రముఖ గాంధేయవాది డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారి విహారభూమి. రాజమండ్రిలో ప్రారంభమైన వందేమాతరం ఉద్యమంతో తాదాత్మ్యం చెంది తొలి రాజకీయ ఖైదీగా శిక్షించబడిన గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారికి స్ఫూర్తి నిచ్చింది రాజమహేంద్రి నగరమే!

ఈ మహనీయుల కోవకు చెందిన వారే శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు.

1952 ఎన్నికల సభలో "ఆఖరు శ్వాస వరకూ గోదావరీ తీరాన్నే వుంటూ దేశసేవ చేస్తా"నన్నారు.

అన్నపూర్ణయ్యను ప్రభవించిన పూత చరిత గోదావరీ తీరం.

## దీక్షితుల వారి దాతృత్వం

పిఠాపురం పట్టణానికి 8 మైళ్ల దూరంలో కొమరిగిరి గ్రామం ఉంది. గత శతాబ్దిలో మద్దూరి కోదండరామ దీక్షితులనే సంపన్న గృహస్థు ఉండేవాడు. ప్రతిదినం ఆయన అతిథులకు అన్నదానం చేయడమే వ్రతంగా పెట్టుకున్నాడు. సాటి బ్రాహ్మణులే కాక ఏ వర్ణం వారికైనా వారి యింట ఆతిథ్యం లభించేది. మధ్యాహ్నం పూట అతిథులకోసం కాచుకొని ఉండేవారు.

వీరి అన్నదాన కార్యక్రమాలు పిఠాపురం రాజావారి చెవిసోకినవి. వెలమ దొరలయిన రాజావారు స్వయంగా గొప్పదాతగా ప్రసిద్ధులు. సామాన్య బ్రాహ్మణ గృహస్థు ఇంత బాహుళ్యంగా అన్నదానం ఎలా చేయగలుగుతున్నాడా అని సంశయం కలిగింది.

రాజావారు మారువేషాలలో వేళకాని వేళ నూరుమంది పరివారంతో యాత్రికులులాగా వేషాలు ధరించి దీక్షితులు గారింటికి చేరారు. తాము వ్యవసాయ పనుల నిమిత్తం పై ఊళ్ళ నుండి వచ్చామనీ అన్నం పెట్టించమనీ అడిగారు.

దీక్షితులు గారు ఏమాత్రం నిరుత్సాహ పడక అందరినీ సాదరంగా ఆహ్వానించారు. పనివాండ్లను పంపి నాలుగు బస్తాల బియ్యం తెప్పించారు. గాడి పొయ్యి మీద క్షణాలలో వంట చేయించి అతిథులకు తృప్తికరంగా భోజనం సమకూర్చారు.

దీక్షితులవారి అద్భుతమైన ఏర్పాట్లకు ముగ్ధులైన పిఠాపురం రాజావారు తమను ఎరుకపరిచి అభినందించారు. తక్షణం వారికి ఇనాముగా కొంత భూమిని ఏర్పాటు చేశారు.

"శతావధాని" చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి తమ "కథలు–గాథలు" (పుట 31)లో ఇలా రాశారు. "కొమరగిరి గ్రామంలో మద్దూరి దీక్షితులు గారనే వారు వేదాధ్యయన పరులు. నిరతాన్నదాతలు, న ప్రతి గ్రహీతలు. వారు చాలా వృద్ధులైనప్పుడు మా గురువు గారితో వారి దర్శనం కూడా నేను చేసి వున్నాను. సదరు దీక్షితుల వారి యోగ్యతను శ్రీ రాజావారు కూడా విని వారిని ఆహ్వానించి సన్మానించాలని అనుకోవడం జరిగింది. దీక్షితులు రాజావారి సన్నిధికి వెళ్లేటప్పటికి రాజావారు స్నానం చేస్తున్నారట. దీక్షితులు వచ్చారని చెబితే వారు తడి బట్టలతోనే బయటికి వచ్చారు."

ఆ దీక్షితుల వారికి స్వయాన మనుమడే మద్దూరి అన్నపూర్ణయ్యగారు.

## బానిసత్వ చిహ్నాలు

మద్దూరి జయరామయ్య, రాజమ్మ దంపతులకు నలుగురు మగ సంతతి. వారిలో పెద్దవారు కోదండరామ దీక్షితులు. రెండవవారు బుచ్చి వెంకయ్య, మూడవవారు అన్నపూర్ణయ్య, కడగొట్టు కుమారుడు కృష్ణమూర్తి.

అన్నపూర్ణయ్య 1899 మార్చి 20న కొమరిగిరిలో జన్మించారు. ప్రాథమిక విద్య కొమరగిరి, పెద్దాపురం లోనే సాగింది.

1911 జూన్‌లో కాకినాడ కళాశాల హైస్కూలులో విద్యార్థిగా III ఫారం 'ఎ'సెక్షన్‌లో ప్రవేశించాడు. అదే తరగతి 'సి' సెక్షన్‌లో అల్లూరి శ్రీరామరాజు (తరువాత సీతారామరాజుగా మారాడు) వుండేవారు.

అన్నపూర్ణయ్యగారి పెద్దన్న అదే కళాశాలలో సీనియర్ ఇంటర్ చదువుతూ వుండేవారు. 1911 డిసెంబరు 11న పంచమ జార్జి పట్టాభిషేక మహోత్సవం కాకినాడ కళాశాలలో వైభవంగా జరుపుతున్నారు. విద్యార్థులు ఆ సాయంత్రం "శశిరేఖా పరిణయం" నాటకాన్ని ప్రదర్శింప తలపెట్టారు.

అన్నపూర్ణయ్య అన్న దీక్షితులు ప్రిన్సిపాల్ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారి ప్రియశిష్యుడు. చక్కని నటనా చాతుర్యం కలవాడు. ఆయన "శశిరేఖ" పాత్ర పోషిస్తూ అన్నపూర్ణయ్య, శ్రీ రామరాజులకు చెలికత్తెలుగా నాటకంలో వేషం ఇప్పించాడు.

కోమల శరీరులయిన బాలురిద్దరూ చెలికత్తెలుగా రంగస్థలంపై చక్కగా అభినయించి ప్రశంసలందుకున్నారు. రాజుకు చెలికత్తెపాత్రతో పాటు నారద పాత్ర కూడా ఇచ్చారు. తన మధుర కంఠంతో దానిని మరింత చక్కగా పోషించాడు.

పంచమ జార్జి చక్రవర్తి జన్మదిన వేడుకలు కాకినాడ కళాశాల వారికొక శుభవార్త తెచ్చాయి. ప్రిన్స్‌పాల్ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారికి రావు బహద్దూరు బిరుద ప్రదానమే ఆ శుభవార్త.

అన్నపూర్ణయ్య ఆ బిరుదు తనకే వచ్చినంత ఆనందించాడు. కానీ రాజు ముభావంగానే ఉన్నాడు.

విద్యార్థులందరికీ జార్జి చిత్రపటంతో పాటు జర్మన్ సిల్వరు పతకాలు ఇచ్చారు. బాల్య చాపల్యంతో అన్నపూర్ణయ్య అయిదారు పతకాలు చేజిక్కించుకున్నాడు. అతి ఆప్యాయంతో ప్రాణసఖుడైన తన అనుంగు రాజుకు అన్నపూర్ణయ్య ఆ పతకాలను అందజేశాడు. వాటిని ఆగ్రహంతో విసిరివేశాడు రాజు. అన్నపూర్ణయ్య నిశ్చేష్టుడైనాడు. "పిచ్చివాడా! ఆ పతకం మన బానిసత్వ చిహ్నంరా!" అని అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

అన్నపూర్ణయ్య తేరుకోవడానికి కొద్ది సమయం పట్టింది. క్రమంగా రాజు సాహచర్యంతో ఆయనలో గాఢంగా దేశభక్తి నాటుకుంది.

ఇంగ్రీషు చదువు పట్ల ఆసక్తి లేని రాజు దేశసేవకు బి.ఏ.అవసరం లేదనేవాడు. అన్నపూర్ణయ్య మాత్రం బి.ఏ.ప్యాసై న్యాయవాదిగా స్థిరపడాలనీ, స్వేచ్ఛాజీవనానికి లాయరు తగిన వ్యాపకం అనే ఆలోచనలో వుండేవాడు.

రాజు తాను త్వరలో సన్యాసిగా మారుతాననీ, దేశమాతకు అంకితమౌతాననీ తరచూ అన్నపూర్ణయ్యతో అనేవాడు.

అర్థాంతరంగా చదువు మానివేసిన రాజు ఏమైనాడో చాలాకాలం అన్నపూర్ణయ్యకు తెలియలేదు.

## బాల సన్యాసి దర్శనం

1917 వేసవిలో ఒక నాటి సాయంత్రం పిఠాపురం నుండి కాకినాడ రైలులో ప్రయాణమైనాడు అన్నపూర్ణయ్య. బుకింగ్ ఆఫీసు వద్ద టికెట్ కొంటున్న వానికి "అన్నపూర్ణయ్యా"అనే పిలుపు వినిపించింది. ఎవరో సన్యాసి వేషంలో నున్న యువకుడు! తనను కాదేమోననుకొని మొహం తిప్పుకున్న అన్నపూర్ణయ్యను తిరిగి అదేమాదిరిగా పిలిచాడా సన్యాసి.

బాల్యమిత్రుడు, ప్రాణ సఖుడు శ్రీ రామరాజు కంఠస్వరాన్ని పట్టి పోల్చుకున్న అన్నపూర్ణయ్య అతనిని ఆలింగనం చేసికొన్నాడు.

"ఏమిటీ సన్యాసి వేషం?"అన్నాడు అన్నపూర్ణయ్య. చిన్నప్పుడే చెప్పాను గదా! అని రామరాజు సమాధానం.

తన ఎదుట ఒక మహాపురుషుడు వున్నట్లు తోచింది అన్నపూర్ణయ్యకు. సంబోధన మార్చి అయ్యా! తమరు నాతో కాకినాడ రావలసినదిగా ప్రార్థన అన్నాడు. అవకాశం లేదన్నాడు సన్యాసి.

మీరెక్కడికి వెళతారు?

మీకార్యక్రమం ఏమిటి? అని తిరిగి ప్రశ్నించాడు అన్నపూర్ణయ్య.

"నా జీవితం ప్రజా సేవకే అంకితం అని చిన్ననాడే చెప్పానుగా" అన్నాడు.

మరి బీసెంట్ గారి హోంరూల్ లీగులో చేరుతారా! అన్న అన్నపూర్ణయ్యకు "అదేమిటి? నన్ను గూర్చి క్రమంగా వింటావులే" అంటూ విడిపోయారు మిత్రులు.

ఇద్దరూ చెరి ఒక త్రోవ పట్టారు.

కాకినాడలో ఇంటర్ విద్యార్థిగానే అన్నపూర్ణయ్య ప్రజాసేవారంగంలో ప్రవేశించాలని ఉండేది. అనిబిసెంట్ హోంరూల్ (1917) విద్యార్థులలో అమిత ప్రభావం చూపింది. విద్యార్థులు రాజకీయాలలో చేరకూడదంటూ 559 జి.ఓ. వుండేది.

అనిబిసెంటు శిష్యులు శ్రీరాం ఆ దినాలలో కాకినాడ వచ్చి గంభీరోపన్యాసాలు చేసేవాడు. ప్రిన్సిపాల్ వెంకటరత్నంనాయుడు ఆ సభలలో పాల్గొనరాదని విద్యార్థులను ఆదేశిస్తూ సర్క్యులర్ పంపాడు.

మొదటి నుండీ ప్రమాదం అంటే అదేదో తేల్చుకుందాం అనే తత్త్వం జీర్ణించుకున్న అన్నపూర్ణయ్య శ్రీరాం ఉపన్యాసాలకు హాజరైనాడు.

ప్రిన్సిపాల్‌తో స్వయంగా ఉత్తర్వులను ధిక్కరించాననీ శిక్ష స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాననీ విన్నవించుకున్నాడు అన్నపూర్ణయ్య.

ప్రిన్సిపాల్ వార్నింగ్ ఇచ్చి వదిలివేశాడు.

అనిబిసెంట్ "న్యూ ఇండియా" పత్రికలో బ్రిటీష్ ప్రభుత్వంపై నిప్పులు గక్కే వ్యాసాలు వ్రాసేది. అన్నపూర్ణయ్య అన్నం అయినా మానివేసేవాడు కాని "న్యూ ఇండియా" చదవకుండా వుండలేకపోయేవాడు.

కాకినాడ కళాశాలలో ఎక్సెల్షియర్ సొసైటీకి రెండేళ్ళు కార్యదర్శిగా ఉన్న అన్నపూర్ణయ్య "ఇండియా స్వరాజ్యానికి అర్హమైనది"అని ప్రసంగించాడు.

బి.ఏ. విద్యార్థిగా రాజమండ్రి కళాశాలలో బ్రిటిష్ రాజరికమే భారతదేశ దారిద్ర్యానికి ముఖ్య కారణమని ఎలుగెత్తి ఉపన్యసించాడు అన్నపూర్ణయ్య. అందుకు ఆగ్రహం చెందిన ప్రిన్సిపాల్ "ఇదుగో మీ ముందర నిలబడ్డాడొక దొంగ"అనేసరికి అందరూ ఫక్కున నవ్వారు.

అప్పటికే "అన్నపూర్ణయ్య" అంటే ఎదిరించేవాడనే పేరు పడింది.

## 1920 డిసెంబరు 2

అన్నపూర్ణయ్య స్వాతంత్ర్య సమరంలో ఎలా ప్రవేశించిందీ స్వయంగా "నా అనుభవాలు" శీర్షిక కింద జయభారత్ పత్రికలో ధారావాహికంగా ప్రకటించాడు.

"విద్యార్థి దశనుండి రాజకీయాలంటే నేను చెవికోసుకునేవాణ్ణి. లోకమాన్య తిలక్ నాకు రాజకీయగురువు. కాకినాడలో ఇంటర్ చదివే రోజులలోనే ప్రజాసేవ చేద్దామని సంకల్పం కలిగింది.

1920 సెప్టెంబరు 1న కలకత్తాలో జరిగిన స్పెషల్ కాంగ్రెసులో గాంధీ మహాత్ముని తీర్మానం ఆమోదింపబడింది. గాంధీజీ మహోపన్యాసమే నన్ను ఆకర్షించింది. ఆ తీర్మానం ప్రకారం విద్యార్థులు విద్యాలయాలు బహిష్కరించి వెంటనే దేశసేవారంగంలో దుముకాలి. సంకల్పం బలంగా ఉన్నా ఆచరించే శక్తి మాత్రం కుంటుపడిపోయింది. కుటుంబ పరిస్థితులు బాగాలేవు. నేను ఎప్పుడు బి.ఏ.ప్యాసు అవుతానా ఎప్పుడు నాలుగు రాళ్ళు సంపాదించి వారిని పోషింతునా అని తల్లి, భార్య, ఇద్దరు తమ్ములు తహతహలాడుతున్నారు. మహాత్ముని అనుసరించానా అది నా సంపాదనపై గొడ్డలి పెట్టన్నమాట.

అప్పటికి నా భార్య కాపురానికి రాలేదు. "తొందరపడి నాన్ కోపరేషన్‌లో చేరవద్దు మనం చాలా ఇబ్బంది పడతాం." అని జాబు కూడా రాసింది. నవంబరు 30వ తేదీకి శాసనసభకు ఎన్నికలు పూర్తి అవుతాయి. గాంధీజీ నాన్ కోపరేషన్ వల్ల సంవత్సరం లోనే స్వరాజ్యం వస్తుందన్నారు. దీనిని నమ్మటం ఎలా?

ఈ లోగా డా॥ పట్టాభి ఏదో పనిమీద రాజమండ్రి విచ్చేశారు. మేము కొందరు విద్యార్థులు ఆయన సలహానడిగాము. ఈలోగా న్యాపతి సుబ్బారావుగారు అక్కడికి వచ్చారు. 1907 జ్ఞాపకం తెచ్చుకోండి అన్నారాయన. అంటే వందేమాతరం వుద్యమంలో గాడిచెర్ల ప్రభృత విద్యార్థులు విశేషంగా నష్టపోయారు."

అన్నపూర్ణయ్యగారు నవంబరు 30వ తేదీ రాత్రి అంతా ఆలోచించాడు. అప్పుడు ఆయనకు బాల్యసఖుడు సీతారామరాజు జ్ఞాపకం వచ్చాడు. క్షణంలో నిర్ణయించుకున్నాడు. చదువుకు స్వస్తి చెప్పి దేశసేవకు అంకితమైనాడు.

ఆరోజు 1920 డిసెంబరు 2వ తేది. అన్నపూర్ణయ్య వెంటనే డా॥సుబ్రమణ్యం గారి వద్దకు వెళ్ళాడు. ఆయన జాతీయ విద్యాలయంలో అధ్యాపకులుగా చేరాడు. యువజనులనందరినీ కూడదీసి "ఆంధ్ర యువజన స్వరాజ్యసభ" స్థాపించాడు.

## జాతీయ విద్యాలయం

1907 లో స్వాతంత్ర్య ఉద్యమకాలంలో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి విచ్చేసారు. ఆయన విజ్ఞప్తి మేరకు పట్టణ ప్రముఖులు శ్రీ న్యాపతి సుబ్బారావు, శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావు, డాక్టర్ శివరాజు వేంకట సుబ్బారావులు భూవి రాళం యిచ్చి జాతీయ పాఠశాలను స్థాపించారు. 1920 ప్రాంతంలో దానిని డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం నిర్వహిస్తూ వుండేవారు.

అన్నపూర్ణయ్య కళాశాల వదిలిన వెంటనే ఇందులో అధ్యాపకులుగా చేరాడు. 1924 లో సీతానగరానికి ఆయనతో పాటు "కాంగ్రెసు" పత్రిక కూడా మారింది. జాతీయ విద్యాలయం వారి అధ్వర్యంలో గల ప్రెస్సులో "కాంగ్రెసు" ముద్రిస్తూ వచ్చారు. 1928 మార్చి 11 న జరిగిన జనరల్ బాడీ మీటింగ్‌లో జాతీయ విద్యాలయం కమిటీ తీర్మానం చేసి "ప్రెస్సు"ను ఆశ్రమానికి ఉచితంగా దఖలు పరిచారు. అంతేకాకుండా అన్నపూర్ణయ్యగారు జైలులో నుండగా పత్రికవారు తమకు చెల్లించవలసిన బకాయీలను రద్దు చేస్తూ కూడా తీర్మానించారు.

జాతీయ విద్యాలయానికి డా॥ సుబ్రహ్మణ్యం సోదరుడు బ్రహ్మజోస్యుల సీతారామయ్య అధిపతిగా వుండేవారు. ఆయన 1922 లో ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామానిచ్చి 1924 నుండి 1930 వరకు జాతీయ విద్యాలయం (సీతానగరం)లో పనిచేశారు.

## జీవితాలను మలుపు తిప్పిన విద్యార్థి మహాసభలు

1921 జనవరి 23న తూర్పుగోదావరి జిల్లా మహాసభలు రాజమండ్రి చింతామణి హాలులో జరిగాయి. డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. "ఆంధ్రరత్న"దుగ్గిరాల గోపాలకృష్ణయ్య సభలకు అధ్యక్షత వహిస్తూ ఆత్మగౌరవాన్ని పెంచని, జీవనభృతికి తోడ్పడని ఆంగ్ల విద్యను విద్యార్థులు వదలి వేసి ఐకమత్యంతో దేశసేవకు పూనుకుంటే ఏడాదిలోగా స్వాతంత్ర్యం లభిస్తుందని ఉద్బోధించారు. ఆయన పిలుపుకు స్పందిస్తూ అప్పటికప్పుడే 55 మంది విద్యార్థులు దేశసేవకు అంకితమవుతామని ప్రతిజ్ఞ చేశారు. వీరిలో మద్దూరి అన్నపూర్ణయ్య, మొసలికంటి తిరుమలరావు, కాండ్రేగుల రామచంద్రరావు, సబ్నవీసు కృష్ణారావు, క్రొవ్విడి లింగరాజుగార్లు ప్రముఖులు.

ఈ సభలో అయ్యదేవర కాళేశ్వరావుగారు పాల్గొన్నారు. కాగా రాజాజీ, నాగేశ్వరరావు పంతులుగార్లు సందేశాలు పంపారు.

1921 మార్చిలో మద్దూరి అన్నపూర్ణయ్య సబ్నవీసు కృష్ణారావు గార్ల అధ్వర్యంలో విద్యార్థుల మహాసభలు భారీ ఎత్తున జరిగాయి. ఈ సభల్లోనే ఆంధ్ర యువజన స్వరాజ్య సభ ప్రారంభించబడింది.

## ఆంధ్ర యువజన స్వరాజ్య సభ

అన్నపూర్ణయ్యగారు 1922 లో తిలక్ మహారాజు చరిత్రను 30 పుటలలో రాసి ప్రచురించాడు. దానిలో ఆయన ఇలా రాశాడు.

"వీరపూజ పరమోత్కృష్టమైనది. ఏ మహాభక్తుని మనము నిరంతరము పూజించుదుమో ఆ మహామహుని యొక్క ఉన్నతాదర్శములు సుగుణ సంపత్తి మన తత్వములోనికి గూడ ప్రవేశించి మనలను పవిత్రవంతులను జేయును."

తిలక్‌ను పరశురాముని గాను, గాంధీ మహాత్ముని తదనంతర అవతారమైన రామునిగాను అన్నపూర్ణయ్య వర్ణించాడు.

"తిలక్ అనగా స్వరాజ్యమని అర్థము. తిలక్ స్వరాజ్యనిధి యని నిత్యము వాడుచు ఆనిధికి మనమందరము కోటి పదిలక్షలను పోగుచేసి యున్నాము. కావున ప్రతి నిమిషమును మనము తిలక్ నామస్మరణ చేయుచునే యున్నాము"అని పేర్కొన్నాడు అన్నపూర్ణయ్య.

ఆ పుస్తకం చివరన ఆంధ్ర యువజన స్వరాజ్య సభ గూర్చి చేసిన ప్రకటన ఇలావుంది. "ఆంధ్ర యువజన స్వరాజ్య సభ గత మార్చి నెలలో స్థాపితమై కాంగ్రెసు ఆదేశములను ప్రజలకు బోధించుటకు పాటుపడుచున్నది. ఆంధ్ర యువకులు అందరూ ఐకమత్యముతో సత్వర స్వరాజ్యసిద్ధికి తోడ్పడటానికై ఈ సభ స్థాపింపబడినది. 16 మొదలు 30 సంవత్సరములలోపున గల ఆంధ్ర యువకులెల్లరూ ఇందు సభ్యులుగా జేరనర్హులు. సంవత్సర చందా ఒక రూపాయి. ఆంధ్ర యువజనుల శక్తి వ్యక్తిత్వము మన ఆంధ్రుల విశ్చితాభిప్రాయమును వెలిబుచ్చుటకే ఈ సంఘము నెలకొల్పబడినది. కరపత్రముల ప్రచురణ కాంగ్రెసు సంఘముల సభ్యుల చేర్చుట రాట్నములు నెలకొల్పుట మున్నగు విషయములందు మా సభవారు కొంత పాటుపడి యున్నారు. మద్యపాననిషేధము నిమ్న జాత్యుద్ధరణము మున్నగు కార్యక్రమముల పని చేయనుద్దేశించి యున్నారు. దేశభక్తులు టంగుటూరి ప్రకాశంగారీ సభకు అధ్యక్షులు. రాజమండ్రి కేంద్ర స్థానము."

## కాంగ్రెసు

ఆంధ్ర యువజన స్వరాజ్యసభ తరపున "కాంగ్రెసు"వార పత్రిక 1922 మార్చి 22న సైక్లోస్టయిల్ పత్రికగా అన్నపూర్ణయ్య ప్రారంభించాడు. క్రొవ్విడి లింగరాజు దీనికి సహాయ సంపాదకులు.

ఇందులో రాసిన ఒక వ్యాసం దేశద్రోహం నేరం క్రింద రాగలదని సంపాదకులు మద్దూరి అన్నపూర్ణయ్యకు 18 నెలల శిక్ష విధించారు. 1923 ఫిబ్రవరి నుండి 1924 జూన్ 13 వరకు అన్నపూర్ణయ్య రాజమండ్రి, వేలూరు జైళ్ళలో ఈ శిక్షాకాలాన్ని గడిపాడు.

1924 నవంబరులో రాజమండ్రికి 13 మైళ్ళ దూరాన గల సీతానగరంలో గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమం నెలకొల్పారు డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు.

"కాంగ్రెసు" పత్రిక ఆశ్రమం నుండి వెలువడసాగింది. అన్నపూర్ణయ్యగారితో పాటు క్రొవ్విడి లింగరాజు, రామచంద్రుని వెంకటప్ప పత్రికలో పనిచేసేవారు.

దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు గారు జర్మన్ ట్రెడిల్ టాప్‌టాప్ కొని పెట్టారు. దాదాపు రెండు మూడు వేల పౌనుల బైపు కూడా ఇచ్చారు.

కాంగ్రెసు పత్రికకు ప్రారంభంలో 600 మంది చందాదారులుండేవారు. పాఠకులు అధిక సంఖ్యలో ఉండేవారు.

తేలికైన వాడుక భాషలో వెలువడే ఈ పత్రిక యువకులను ఎక్కువగా ఆకర్షించింది. 1857 నాటి విప్లవ వీరుల గాథలను 1926 నుండి 1929 వరకూ వరుసగా "కాంగ్రెసు" ప్రచురించింది.

కాంగ్రెసు సంపాదకీయాలు నిప్పులు చెరిగేవి. కొన్ని ఉదాహరణలు:–

## 1922 నవంబరు 22:

మన దేశం కల్పవృక్షం. దాని పండ్లు దేశ ప్రజలు కాక ఇతరులే అనుభవిస్తున్నారు.

## 1925 ఆగస్టు 13:

దేశంలో చెలరేగిన హిందూ ముస్లిం కలహాలకు పూర్తి బాధ్యత బ్రిటీషు ప్రభుత్వానిదే! దేశంలో తాము పాతుకుపోవడానికి ప్రభుత్వం ఇలాంటి కలహాలకు ఒడిగడుతుంది.

## 1922 మే 29:

కోర్టులలో జరుగుచున్నది విచారణ కాదు. తోలు బొమ్మలాట.

## 1925 సెప్టెంబరు 8:

"మనలో మనం"ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ఆమోదించిన సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్య సాధనకు ఎలాంటి భారాన్నైనా వహించడానికి సిద్ధంగా ఉన్నాం. అవసరమైతే ఇండిపెండెంటు పార్టీ కూడా నెలకొల్పబడాలి.

## 1929 జనవరి 14:

పోలీసు దుష్కృత్యాలు చూస్తుంటే బ్రిటీష్ వారి రోజులు దగ్గర పడుతున్నాయి.

ఖద్దరు ధారులను బట్టలు ఊడబెరికించిన పోలీసు అధికారులు ముస్తఫా అలీ ఖాన్, డప్పుల సుబ్బారావు అపర రాక్షసులు, దుశ్శాసనులు.

1930 ఉప్పు సత్యాగ్రహ సందర్భంగా కాంగ్రెసు సంపాదకీయాలు.

"నీ దేశం బ్రతికి బట్టకడితే నీవు మరణిస్తే మాత్రం నష్టం ఏమిటి? నీ దేశం మట్టి కొట్టుకు పోతే నీవు వుండి ప్రయోజనం ఏమిటి?"

1926 జూలై 16 న రాజమండ్రిలో అల్లూరి సీతారామరాజు జయంతి సందర్భంగా "కాంగ్రెసు"విశేష సంచిక ప్రకటించింది. సీతారామరాజును గురించి గాంధీజీ

అభిప్రాయాన్ని కోరగా ఆయన జీవితాన్ని తనకు రాసిపంపమని అన్నపూర్ణయ్యను కోరారు.

గాంధీజీకి అలాగే రాసి పంపారు. గాంధీజీ 1929 జూలై 18 "యంగ్ ఇండియా"లో ఇలా రాశారు.

"సాయుధ విప్లవం పైన నాకు సానుభూతి గానీ, అభిమానం గానీ లేవు. అయితే రాజువంటి శీలవంతుడు, నిరాడంబరుడు, త్యాగి, ధైర్యవంతుడు, ఉన్నతాశయుడు అయిన యువకుడిని నేను అభినందించకుండా వుండజాలను. అన్నపూర్ణయ్య సేకరించిన విషయాలు నిజమైనట్లయితే ఆయన పితూరీ దారుడు కాదు. గొప్ప వీరుడు. ఈ దేశంలో వున్న యువకులందరూ శ్రీ రామరాజుకున్న ధైర్య సాహసాలను ఆయన దేశభక్తిని, నిర్మాణ శక్తిని చాకచక్యాన్ని అలవరచుకొని వాటిని సంపూర్ణ అహింసాయుత పద్ధతుల ద్వారా స్వరాజ్య సంపాదనకు ఉపయోగించిన ఎంత బాగుండును.?"

ఆంధ్ర దేశంలో యువజనోద్యమ నిర్మాత అల్లూరి సీతారామరాజే అని అన్నపూర్ణయ్య భావన. ఆయనకు నివాళులను సమర్పించటంలో అన్నపూర్ణయ్య చేసినంత కృషి మరెవ్వరూ చేయలేదు.

తన పత్రిక ద్వారా రాజును, ఆయన సాధించిన విజయాల గురించి ఉత్తేజితమైన మహోన్నత మైన రచలను చేశాడు.

1927 నుండి వరుసగా రాజు జయంతి ఉత్సవాలను నిర్వహించటానికి అన్నపూర్ణయ్య పూనుకున్నాడు. కానీ పెద్దల నుండి నిరాదరణ లభించింది. అధ్యక్షత వహించటానికి ఎవరూ ముందుకు వచ్చేవారు కారు. చివరకు తొలి జయంతి సభకు వేమవరపు రామదాసుగారు అధ్యక్షత వహించి జయప్రదం చేశారు.

రెండవ జయంతి సభకు శ్రీ దండు నారాయణ రాజుగారధ్యక్షత వహించారు. రాజమండ్రి లోనే కాక బెజవాడ మొదలుగాగల ఇతర పట్టణాలలో వేడుకలు జరిగాయి. మద్రాసులోని రిపబ్లికన్ కాంగ్రెసులో, 1928 డిసెంబరులో కలకత్తాలో జరిగిన అ.భా.కాంగ్రెసు యువజన మహాసభలో ఈ మహనీయుడు కీర్తించబడినాడు. 1929లో జరిగిన మూడవ జయంతి సభకు నేతాజీ, జవహర్‌లాల్‌లు సందేశాలు పంపారు. గుంటూరు, మచిలీపట్నాలలో కూడా జయంతి సభలు జరిగాయి. మచిలీపట్నం సభలో రాజుకు డాక్టర్ పట్టాభి ఘనంగా నివాళులర్పించారు.

1936 జూన్ 23న ఏలూరిలో అల్లూరి సీతారామరాజు వర్ధంతి సభలకు హాజరు కావలసివున్న మద్దూరి అన్నపూర్ణయ్య, గారపాటి సత్యనారాయణ, బసవరాజు రంగశాయిగార్ల మీద ప్రభుత్వం నిషేధాజ్ఞలు జారీ చేసింది.

1929 మే 9 న "కాంగ్రెసు" కార్యాలయం సందర్శించిన మహాత్మగాంధీ సిబ్బంది చాపలమీద రాత బల్లల పైన రాసికొనడం చూచి మిక్కిలి సంతసించారు. హింస, అహింసను గూర్చి గాంధీజీతో మద్దూరి అన్నపూర్ణయ్య పందిరి మల్లికార్జున రావులు సుదీర్ఘంగా చర్చించారు.

1929 మే 16తేదీ గల "యంగ్ ఇండియా"లో గాంధీజీ ఇలా రాశారు. "కాంగ్రెసు"అనుపేరుతో ఒక తెలుగు వార పత్రిక ఆశ్రమంలోనే ప్రచురింపబడుతున్నది.

అది ఇప్పుడు స్వయం పోషకంగా వున్నది. దాని సంపాదకుడైన శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యకు రాజద్రోహం క్రింద నిర్బంధితుడై ఖైదుకు పోయిన గౌరవం దక్కింది. అయినప్పటికీ పత్రిక సజీవంగానే వున్నది.

మొట్టమొదట పత్రిక ఒక ఫుల్ స్కేప్ కాగితం పైన సైక్లో స్టయిలుతో వెలువడుతుండేది. ఇప్పుడది రాయల్ సైజులో 14 పుటలతో వస్తున్నది. అది కొన్ని నిర్ణీత ప్రకటనలు మాత్రమే ప్రచురిస్తుంది. "విదేశీ వస్తువులు, బ్రిటీషు వస్తువులు, మత్తుపదార్థాలు మొదలయిన ప్రకటనలను ముద్రించదు. ఆ పత్రిక అధినివేశ ప్రతిపత్తికి ప్రతికూలంగా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రతిపాదిస్తుంది." అని వారి నివేదికలో సగర్వంగా చెప్పుకున్నారు. తెలుగు అక్షరాలలో హిందీ పాఠాలను క్రమబద్ధంగా ప్రచురించటం దాని ప్రత్యేకత.

సీతానగరం ఆశ్రమాన్ని దర్శించిన ప్రఖ్యాత పాత్రికేయుడు కోటంరాజు రామారావు "కాంగ్రెసు" సిబ్బంది యావన్మందీ అన్ని పనులు సుబ్బరంగా చేస్తున్నారని, అచ్చుకూర్పు పని కూడా చేస్తున్నారని మెచ్చుకున్నారు.

'కాంగ్రెసు"సహాయ సంపాదకుడైన రామచంద్రుని వెంకటప్ప వ్రాసిన "చిచ్చుల పిడుగు" ఏకాంకికను 1929 మే 7 తేదీగల "కాంగ్రెసు"లో ప్రచురించినందుకు సంపాదకుడు మద్దూరి అన్నపూర్ణయ్యకు దేశద్రోహం నేరం కింద రెండున్నర సంవత్సరాల శిక్ష విధించబడింది. 1929 మే 13న అన్నపూర్ణయ్య జైలు పాలు కాగా క్రొవ్విడి లింగరాజు గారు సంపాదకులైనారు. 1931 మార్చి "కాంగ్రెసు" పత్రికలో భగత్‌సింగ్ ఉరితీతను ఖండిస్తూ "వీరబలి"పేర వ్యాసం ప్రచురించినందుకు దేశద్రోహం నేరం కింద లింగరాజుగారికి రెండు సంవత్సరాల శిక్ష విధించబడింది.

అన్నపూర్ణయ్య మే 13న అరెస్టయిన వెంటనే "హిందూ"పత్రికలో ఇలా ప్రకటన చేసారు.

"మా నాయకుడు శ్రీ సాంబమూర్తిని నిర్బంధించిన పిమ్మట నా అరెస్టుకు నేనేమీ ఆశ్చర్యపడటం లేదు. ఈ సంవత్సరం దేశమంతటా జరిగిన యువజనుల అరెస్టులు గమనిస్తే దేశంలో స్వాతంత్ర్య ఉద్యమాన్ని అణచటమే అధికారుల కోరికగా కన్పిస్తున్నది. ఇది మా "కాంగ్రెసు"పత్రికపై దురాక్రమణగా తలుస్తాను. వీటివల్ల మేము భయపడటంలేదు. ఈ ఏడాదిలో ఇద్దరు సంపాదకులను జైళ్లలో నిర్బంధించినపుడే మేము బతికి బట్టకట్టాము. నా నిర్బంధము తరువాత కూడా బావుటా ఎగురుతూ వుండగలదు. ప్రజానీకం కష్టకాలంలో మాకు అండగా నిలబడతారనడంలో నాకు ఎలాంటి సందేహం లేదు."మద్దూరి అరెస్టును ఖండిస్తూ తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకటరావు స్టేటుమెంటు రాసి యివ్వగా టెలిగ్రాఫ్ శాఖ దానిని తీసికొనుటకు నిరాకరించింది.

1931 ఆగస్టులో లింగరాజుగారు అరెస్టుకాగా రామచంద్రుని వెంకటప్ప "కాంగ్రెసు" సంపాదకుడైనాడు. అన్నపూర్ణయ్య 1931 సెప్టెంబరులో జైలు నుండి విడుదలయి వచ్చి తిరిగి సంపాదక బాధ్యతలు చేపట్టాడు. ఆశ్రమంపై 1932 జనవరిలో పోలీసు దాడి జరిగే వరకు ఆయన సంపాదకత్వాననే "కాంగ్రెసు" వెలువడింది.

1922లో ప్రారంభమైన "కాంగ్రెసు"పది సంవత్సరాలలో చరిత్ర సృష్టించింది. అన్నపూర్ణయ్య, లింగరాజు, వెంకటప్పయ్య, కాండ్రేగుల రామచంద్రరావు, చంద్రుపట్ల హనుమంతరావు గారలు కాంగ్రెసుతో సంబంధం మూలకంగా జైలు కెళ్లిన వారు కావడం గమనార్హం.

## 'కాంగ్రెసు' స్వాతంత్ర్య సంచిక ఆంధ్రపత్రిక సమీక్ష

1929 మే 21న కాంగ్రెసు పత్రిక స్వాతంత్ర్య సంచికను సమీక్షిస్తూ ఆంధ్ర పత్రిక ఇలా రాసింది. "ఈ నెల 10వ తేదీని వెలువడిన 8వ సంపుటి 16సంచిక కృతజ్ఞతతో నందుకొంటిమి. దీనిలో 16పుటలున్నవి. స్వాతంత్ర్య యుద్ధ నాయకుడు శ్రీమత్ నానాదూండీపంత్ సాహెబ్ జగదేశపురాధీశుడు 80 ఏండ్లు వృద్ధునగు రాణాకుమార్ సింహుడు అనునీయిద్దరి యోధుల పటములను వరసగా ఆద్యంతములపై గంభీరముగా ముద్రింపబడెను." "చిచ్చులపిడుగు" ఏకాంక నాటకం, రాణాకుమారసింహుడు 1857 లక్ష్మీ బాయి అగ్ని ప్రవేశం తాంతియా తోపి, కవికుమారుల సుమాంజలి మున్నగు వ్యాసము లిందుకలవు."

## చిచ్చులపిడుగు

ఈ ఏకాంకికను ప్రచురించినందుకే అన్నపూర్ణయ్యకు 1929 లో $2\frac{1}{2}$ సంవత్సరాల శిక్ష విధించబడింది.

దీని రచయిత రామచంద్రుని వెంకటప్పగారు "కాంగ్రెసు"సహాయ సంపాదకులు. వీరి స్వగ్రామం ఒంగోలు సమీపంలోని టంగుటూరు. 1921లో నెల్లూరు హైస్కూల్ లో చదువు చాలించి అచ్యుతుని వెంకట్రావు అను మారు పేరుతో కాంగ్రెసు ప్రచారం చేసి ఆరునెలల శిక్ష పొందాడు. రాజమండ్రి జైలులో బులుసు సాంబమూర్తి గారితో పరిచయమేర్పడి ఆయనకు కుడి భుజంగా మెలుగుతూ వుండేవాడు. విడుదల పిమ్మట సాంబమూర్తి గారితో పాటు కాకినాడ చేరాడు. సీతానగరం ఆశ్రమం ఏర్పాటయినప్పుడు సాంబమూర్తిగారీయనను డాక్టర్ సుబ్రహ్మణ్యంగారికి వప్పజెప్పారు. వెంకటప్ప మద్రాసులో జరిగిన "నీల్" సత్యాగ్రహంలో ప్రముఖపాత్ర వహించాడు. ఆంగ్లము, సంస్కృతము చక్కగా చదివిన వాడు. రచయిత.పరిశోధకుడున్నూ. "చెన్నపట్నం, తెలుగు పట్నం"అనే వీరి గ్రంథం బహుళ ప్రచారం పొందింది. ఆంధ్రులలో స్వాతంత్ర్య పిపాస రగిలించేందుకే "చిచ్చులపిడుగు" ఉద్దేశింపబడినదని రచయిత వెంకటప్ప తెలిపాడు.

మొదటిరంగమున మంగలపాండ్యా స్వగతము తీవ్ర పదజాలంతో కూడి "ఓ ఆంగ్ల పిశాచీ! ఇంకనూ నీ ఆకలి తీరలేదా! ఎన్నటికారునే రాక్షసీ" ఉద్రేకం కలిగిస్తున్నది.

రెండవ రంగంలో హ్యూసన్, బౌ అను ఆంగ్లేయ సైనికాధికారులను పాండ్యా కాల్చగా గురితప్పి పోతుంది. చివరకు అనేకసార్లు కత్తితో పొడిచి "బౌ"ను చంపివేస్తాడు. ఈ లోగా పడిపోయిన హ్యూసన్ లేవబోతూవుంటే ఒక సిపాయి వానిని తుపాకి మడమతో తీవ్రంగా కొట్టి చంపివేస్తాడు. మరికొంతసేపటికి "వీలర్" అను

సైనికాధికారి అక్కడకువచ్చి మంగళ పాండ్యాను బంధించవలసిందిగా ఉత్తర్వు జారీ చేస్తాడు. జమేదారు అధికారితో బ్రాహ్మడైనందున మంగళ పాండ్యాపై సైనికులెవరు చేయివేయరని చెబుతాడు. ఇంతలో హెర్సె అను మరొక సైనికాధికారి తన ఇరువురి కుమారులను వెంటబెట్టుకొని ఆ ప్రదేశానికి వస్తాడు. అతడు పాండ్యాను చంపటానికి ఉద్యుక్తుడవుతాడు. ఇది గమనించిన పాండ్యా తనను తానే కాల్చుకొంటాడు. కానీ మరణించడు. జమేదారు వానిని ఆస్పత్రికి తరలిస్తాడు. మూడవ రంగం పాండ్యా ఉరితీసే ఘట్టంతో నాటకం ముగుస్తుంది. ఉరితీసే ముందు కడపటికోరిక ఏమిటని పాండ్యాను అధికారులు ప్రశ్నిస్తారు. అంతట పాండ్యా "మీ జాతి ఎల్ల ప్రాణములపై ఆసయున్నదేని మాదేశమును విడిచి పోవుగాక"అంటూ ఉరికంబం ఎక్కుతాడు.

రచయిత చివర అహింసా వాదాన్ని ప్రవేశపెట్టగా సంపాదకుడైన అన్నపూర్ణయ్య ఆ భాగమును తొలగించి పత్రికలో వేశాడు. ఆ నాటిక దేశ ద్రోహాన్ని పురికొల్పుతున్నదని నేరారోపణగావించి అన్నపూర్ణయ్యగారికి 124A, 153A సెక్షన్ల కింద విచారించి 2 సం॥ శిక్ష 500 జరిమానా కాకున్న మరో ఆరునెలల శిక్ష విధించారు. అంతేకాదు. ఈ నాటికను ప్రభుత్వం G.O.M.S.No. 906, dt.6-9-29 ద్వారా నిషేధించింది. కానీ 1929లో గుంటూరు యూత్ లీగు తరపున ఆమంచర్ల గోపాలరావు కోనవల్లి సుబ్రహ్మణ్యం, మాడభూషి వెంకటాచారి, ఆనాటి మునిసిపల్ ఛైర్మన్ బారిష్టరు నడింపల్లి నరసింహారావుగారి అండదండలతో పోలీసుల కన్నుగప్పి ప్రదర్శించారు. ఆనాటి ప్రేక్షకులలో కొండా వెంకటప్పయ్య ప్రభృతులున్నారు. పోలీసులకు సాక్ష్యం దొరకక ఒక్కరినీ అరెస్టు చేయలేదు.

ఈ నాటిక రచయిత పేరు తెలుపమని అన్నపూర్ణయ్యను, లింగరాజుగారిని ఎన్నివిధాల ఒత్తిడి పెట్టినా పాత్రికేయుల నైతిక సూత్రాలననుసరించి చెప్పటానికి నిరాకరించారు.

1950 లో నాటికపై నిషేధాన్ని ప్రభుత్వం తొలగించింది. రచయిత స్వయంగా దానిని ప్రచురించి దివంగతయైన వీరపత్ని మద్దూరి వెంకటరమణమ్మకు అంకితమిచ్చారు. రచయితను తానేనని కోర్టులో వాగ్మూలము ఇవ్వడానికి వెంకటప్ప సంసిద్ధుడుకాగా అన్నపూర్ణయ్య అతనిని వారించాడు. అంతే కాదు. వేలూరు జైలుకు వెడుతూ ఒక లేఖను వెంకటప్పయ్యకు ఈ విధంగా రాసాడు. "నీ రచలకై నేను బాధపడవలసి వచ్చెనని ఎన్నడును అనుకొనుట లేదు. నేను దానిని చూచితిని. హర్షించితిని. ప్రచురించితిని. పూర్తి బాధ్యత నాదే! కావున నీవేమియు బాధపడకు. నేను మర్యాదకు వ్రాయుటలేదు. హృదయపూర్వకముగా వ్రాయుచున్నాను."

కలెక్టరు ఎదుట ఈ నేరమునకు సమాధానంగా అన్నపూర్ణయ్య సుదీర్ఘ ప్రకటన చేశాడు. "1857 నాటి భారత స్వాతంత్ర్య యుద్ధము యొక్క సహజమైన స్వరూపమును చరిత్రను చూపుటే నా ఉద్దేశ్యం. ఇది నిజమైన కథ. చరిత్రలో కలదు. ఈకథయే "చిచ్చులపిడుగు"కు ఆధారము. మంగల పాండ్యా ధైర్యశాలి కథానాయకుడు. కాని నతని ఆదర్శ ప్రాయునిగా చూపియుండలేదు. నేను దౌర్జన్య రాహిత్యవాదిని. అతడు నాకెట్లు ఆదర్శ పురుషుడగును? మంగల్ ఆతురపడినాడు. ఆయాతురత అతనికి లేకుండినచో ఇండియాకు స్వరాజ్యమెన్నడో వచ్చి యుండేది. నేను దౌర్జన్యరాహిత్యవాదిని. నాపత్రిక యందు దౌర్జన్య విధానము మందున కగపడదు.

నేను సభ్యుడుగా నున్న కాంగ్రెసు నందుగాని యువజన సంఘము నందుగాని దౌర్జన్యమనుమాటలేదు. ఇక నాయందు దౌర్జన్యమెట్లు వచ్చును. సర్వమతసమత్వము అక్షరక్షరము ఆచరణయందుండు యువజన సంఘమున కధ్యక్షుడను. మతవిద్వేషము నెట్లు పెంచగలను?

వీర సావర్కారు రాసిన "భారతస్వాతంత్ర్య సమరము", ఛార్లెస్ బాల్ రచించిన మ్యూటినీ చరిత్ర రాబర్ట్సు ప్రభువు" ఇండియాలో నా 40 సంవత్సరాల జీవితము" ఈ రచనకు ఆధారమని రచయిత వెంకటప్ప తెలిపాడు. క్రొవ్విడి లింగరాజుగారు మెడోస్ టైలర్ వ్రాసిన "సీతా"నవల దీనికి ఆధారమన్నారు.

## మద్రాసు కౌన్సిల్ లో 'మద్దూరి'

1929 లో జైలు నిబంధనల్లో మార్పులు వచ్చేటంత వరకూ రాజకీయ ఖైదీల పరిస్థితి దుర్భరంగా వుంటూ వచ్చింది.

బెంగాల్ యువకుడు జతీన్‌బోసు జైల్లో మానవతాదృక్పథం కోసం 63 రోజులు నిరాహార దీక్ష పూని 1929 సెప్టెంబరు 14న అమరజీవియైనాడు. ఆయన దీక్షకు మద్దతు ప్రకటిస్తూ రాజమండ్రి గోదావరీ తీరాన మద్దూరి అన్నపూర్ణయ్య ఆచార్య రంగాగార్లు గొప్ప సభ జరిపారు.

జతీన్ బాబు మరణంతో బ్రిటీషు ప్రభుత్వం కన్నుతెరచి రాజకీయ ఖైదీలను ఎ.బి.సి.తరగతులుగా విభజిస్తూ జైలు నిబంధనల్లో మార్పు తెచ్చింది.

1929లో అన్నపూర్ణయ్య అరెస్టు అయ్యే నాటికి ఈ రూల్సు అమలులో లేవు. వీటిని తనకు అనుసంధించమని దరమిలా ఆయన కోరలేదు. సవరించిన నిబంధనల మేరకు అన్నపూర్ణయ్యకు సౌకర్యాలు కల్పించాలని బ్రిటీష్ ప్రభుత్వానికి ఏకోశాన లేదు. చెన్నపురి శాసనమండలిలో ఈ విషయం చర్చకు వచ్చినప్పుడు న్యాయశాఖ చూస్తున్నది – కృష్ణన్‌నాయర్. ఆయన భారతీయుడై వుండి కూడా ఇంతటి అకృత్యానికి ఒడిగట్టడం అన్యాయమంటూ అనంతపురం నుండి వెలువడే "శ్రీ సాధన" విచారం వ్యక్తం చేసింది.

గొప్ప దేశ భక్తుణ్ణి ఇతర నేరస్థులతో పాటుగా పరిగణించడం ఘోరం అంటూ నిరసన వ్యక్తం చేశాడు ప్రతిపక్ష కాంగ్రెసు నాయకుడు సత్యమూర్తి. ఆయన ఇంకా ఇలా అన్నారు. "ఈ తీర్మానం తెచ్చిన ప్రభుత్వ సభ్యుడు మద్రాసు చరిత్రలో ఆకస్మిక వ్యక్తిగా గతించిపోతాడు. కానీ ఇతడు శిక్షించాలని కోరుతున్న అన్నపూర్ణయ్య పేరు మాత్రం సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. దేశ గౌరవాన్ని స్వాతంత్ర్యాన్ని పరిరక్షించిన వ్యక్తిగా భావితరం ఆయన పేరును జ్ఞాపకం వుంచుకొంటుంది."

## పూర్ణ స్వరాజ్యవాదులు

ఆంధ్రదేశంలో మహర్షి బులుసు సాంబమూర్తి అతివాద నాయకుల్లో ప్రథముడు. ప్రజాసేవలో తనకు ఓనమాలు నేర్పిన గురువుగా ఆయనను అన్నపూర్ణయ్య గౌరవించేవాడు.

1921 సెప్టెంబరులో తూర్పు గోదావరి జిల్లా రాజకీయ మహాసభలో కాంగ్రెసు పూర్ణ స్వరాజ్యం కోసం కృషి చేయాలని తీర్మానం ప్రవేశ పెట్టారు బులుసు సాంబమూర్తి. ఆంధ్ర కేసరి ప్రకాశం సైతం దీనిని జీర్ణించుకోలేక తొందరపాటు కూడదని వాదించారు. అయినా సాంబమూర్తి తన వాదనా పటిమతో సభ్యులను తన వైపు తిప్పుకొని తీర్మానం నెగ్గించారు. తూర్పుగోదావరి జిల్లాలో ఎన్నడైనా అభిప్రాయభేదాలు పొడసూపినపుడు సాంబమూర్తి గారి తుది పరిష్కారం అందరికీ శిరోధార్యమయ్యేది. ముఖ్యంగా కాకినాడ కాంగ్రెసు సమయంలో తన ఏకైక కుమారుని మృతికి విలపించక మహాసభల కార్యక్రమాల్లో మునిగిపోయిన ఆయన స్థితప్రజ్ఞత మహర్షిగా కొనియాడబడుటకు కారణభూతమైనది.

నిజంగా అన్నపూర్ణయ్యగారికి, బులుసు సాంబమూర్తి, డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గారల సాహచర్యం లభించడం ఒక గొప్ప వరం. ముందు కార్యకర్తల అవసరాలు తీర్చి తాము తమ సౌకర్యాలు చూసుకొనే మహానాయకులు బులుసు వారు, డాక్టరుగారు.

1928 నాటికే అన్నపూర్ణయ్యకు అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యత్వం లభించింది. 1927 డిసెంబరులో మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభలలో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, శ్రీనివాస అయ్యంగారి, డాక్టర్ అన్సారీ ప్రభృతుల ప్రోత్సాహంతో సంపూర్ణ స్వాతంత్ర్యమే భారత దేశ లక్ష్యమని తీర్మానించారు. దానితో స్వాతంత్ర్య ఉద్యమానికి బలం చేకూరింది. సంపూర్ణ స్వాతంత్ర్య కక్షి (Indian Independence League) ఏర్పడింది. దీనికి శ్రీనివాస అయ్యంగారు అధ్యక్షులు. పండిత నెహ్రూ, సుభాస్ చంద్ర బోసులు కార్యదర్శులు. శ్రీ సాంబమూర్తి, సర్దార్ శార్దూల్ సింగ్, మద్దూరి అన్నపూర్ణయ్య ప్రభృతులు ముఖ్య కార్యకర్తలు.

ఇండియన్ ఇండిపెండెన్సు లీగు ఆంధ్ర శాఖకు బులుసు సాంబమూర్తి అధ్యక్షులు, డాక్టర్ సుబ్రహ్మణ్యం కార్యదర్శి. లీగు కార్య వర్గ సభ్యుడైన అన్నపూర్ణయ్య విస్తృతంగా పర్యటించి లీగు కార్యకలాపాలు ఆంధ్ర దేశంలో ఉధృతం చేశాడు.

"కాంగ్రెసు"పత్రిక కూడా పూర్ణ స్వరాజ్య సిద్ధాంతానికి అంకితమైనట్లు నిర్ద్వంద్వంగా ప్రకటించింది.

1936 ఫిబ్రవరి 29 న నెల్లూరు జిల్లా యువజనుల నుద్దేశించి ప్రసంగించిన అన్నపూర్ణయ్య, యువజనులు కాంగ్రెసును వశం చేసుకొని కార్మిక కర్షక రిపబ్లిక్ ఏర్పడేందుకు కృషి చేయాలని ఉద్బోధించాడు.

## గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమం

అల్యూమినియం వ్యాపారానికి రాజమండ్రి ఒక ముఖ్య కేంద్రం. 1924 లో కాంగ్రెసు వీరాభిమాని సేట్ జీవన్‌లాల్ అల్యూమినియం వ్యాపార నిమిత్తం రాజమండ్రి వచ్చాడు. గ్రామీణ ప్రాంతాలలో కృషి చేసేవారి కొరకు తన ఆదాయంలో కొంతభాగాన్ని కేటాయిస్తానని డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారికి తెలిపాడు.

సీతానగరంలోని గౌతమీ సత్యాగ్రహం ఆశ్రమం 1924 నవంబరులో నెలకొనడంలో వీరి దాతృత్వం విశేషంగా తోడ్పడింది.

రాజమండ్రికి 13 మైళ్ల దూరంలో గల గోదావరి ఒడ్డున గల సీతానగరం వెనుకబడిన ప్రాంతం. అయినా అక్కడి ప్రజలలో రాజకీయ చైతన్యం ఎక్కువ. ఆ ప్రాంతంలోనే పలువురు గ్రామోద్యోగులు రాజీనామాలిచ్చి ఉద్యమ వ్యాప్తికి తోడ్పడినారు.

14 ఎకరాల భూమిలో నెలకొనివున్న ఆశ్రమానికి ప్రజలు విశేషంగా సహకరించడం మూలాన 1925 జనవరి నాటికి 12 పక్కా ఇండ్లు ఏర్పడ్డాయి. 1926 వేసవినాటికి మంచి నీటి వసతి ఏర్పడింది. ఖద్దరు ప్రచారం, ఉచిత వైద్యసేవ, హిందీ విద్యావ్యాప్తి, కాంగ్రెసు పత్రిక నిర్వహణ – ఆశ్రమం నిర్వహించిన కార్యక్రమాలు. "కాంగ్రెసు"పత్రిక – మద్దూరి అన్నపూర్ణయ్య ప్రధాన సంపాదకులుగా, క్రొవ్విడి లింగరాజు రామచంద్రుని వెంకటప్ప సహాయకులుగా ప్రచురితమవుతూ వుండేది. వీరందరూ అరెస్టయిన పిమ్మట చంద్రుపట్ల హనుమంతరావు, కాండ్రేగుల రామచంద్రరావులు కూడా సంపాదకులుగా పనిచేశారు. మద్దూరి కృష్ణమూర్తి (అన్నపూర్ణయ్య గారి సోదరులు), వంగల సత్యనారాయణ కంపోజింగ్ పనులు నిపుణతతో నిర్వహించేవారు.

ఆశ్రమ వాసులు కుటుంబాలతో వుండేవారు. వారి అవసరాలను బట్టి వారికి వేతనాలు అందేవి. డాక్టరు సుబ్రహ్మణ్యం గారికి యాభైరూపాయలు, మద్దూరి అన్నపూర్ణయ్యగారికి నలభై తొమ్మిది రూపాయలు, క్రొవ్విడి లింగరాజుగారికి ముప్పై అయిదు రూపాయలు. ఇదొక సామ్యవాద ప్రయోగంగా ప్రశంసింపబడింది.

1929 మే 9 తేదీన గాంధీజీ ప్రథమంగా ఆశ్రమాన్ని దర్శించి నిర్వహణపట్ల సంతృప్తి ప్రకటించారు. తిరిగి 1933 డిసెంబరులో గాంధీజీ మరొకసారి ఆశ్రమానికి విచ్చేశారు. 1932 జనవరిలో పోలీసు దాడిలో జరిగిన విధ్వంసానికి ఆయన చాల మనస్తాపం చెందారు.

1932 జనవరి 5 న మద్రాసు గెజిట్‌లో సీతానగరం ఆశ్రమం చట్టవిరుద్ధమని ప్రభుత్వం ప్రకటించింది.

ఆశ్రమం చేస్తున్న కృషి యావద్భారతదేశాన్ని ఆకర్షించింది. 1930 ఆరంభంనుండి సీతానగరం – పోలీసులకు నివాసస్థానమైంది. సత్యాగ్రహ శిక్షణా శిబిరం. సాగుతున్నంత కాలం అక్కడి గ్రామాలనుండి జనం తీర్థ ప్రజలాగున ఆశ్రమానికి వస్తూ వుండేవారు. జనం అమితోత్సాహంతో వుండేవారు. ఈ శిబిరంలో శిక్షణకు రాష్ట్రం నలుమూలలనుండి వచ్చేవారు. అనంతపురం జిల్లా నుండి వచ్చిన హరే సముద్రం నరసింగరావు తన అనుభవాలను గూర్చి ఇలా రాసారు. "తూర్పు గోదావరి జిల్లా గౌతమీ సత్యగ్రహాశ్రమము వారి యాధ్వర్యమున నొసగ బడుచుండిన శిక్షణమునందు ఒక నెల పని చేసితిని. ఈ ఆశ్రమము మన ఆంధ్ర దేశమున చాల గొప్పది. గోదావరి గట్టుననే యున్నది. దాదాపు యిన్నూరు కుటుంబముల వారిందులో పని చేయుచున్నారు. దాని యందొక పెద్ద ఖాదీ భాండారము గలదు. మాసమునకు రెండువేల రూప్యములు వెలగల ఖద్దరచ్చట తయారగుచున్నది. ఈ యాశ్రమము "కాంగ్రెసు"అను వారపత్రికను ప్రకటించుచున్నది. ఈ యాశ్రమమున

ఒక గొప్ప ఆస్పత్రియు, గ్రంథాలయమును గలవు. తల్లిదండ్రులులేని పిల్లలెందరోయిందు పనిచేయుచున్నారు. ఈ యాశ్రమమునకు డాక్టరు బ్రహ్మజ్యోస్యుల సుబ్రహ్మణ్యం గారు నాయకులుగా నుండిరి. వీరిప్పుడు వేలూరు కారాగారమునందున్నారు.

ఈ యాశ్రమమునందు శిక్షణ పొందిన దాదాపు నూరు మంది వాలంటీరులము ఆశ్రమమునందుండు మగవారందరూ - మహర్షి బులుసు సాంబమూర్తిగారి నాయకత్వము కింద సంవత్సరాదినాడు సాయంకాలము నాలుగు గంటలకు కాకినాడకు బయలుదేరితిమి. అప్పటి దృశ్యము చూడవలసినదేకాని వ్రాయనలవికాదు.

కాకినాడ మేము చేరునప్పటికి మహాత్మాగాంధీ ఉప్పు చట్టమును ధిక్కరించుటకు "దండి"చేరియుండెను. మేము కాకినాడ చేరినంతనే మహాత్ముని యాజ్ఞననుసరించి చట్టమును ధిక్కరించి వుప్పు చేయ మొదలిడితిమి. ఒక నెలవరకు నిరాఘాటముగా మాపని నెరవేరినది. దినమునకు 5,6 మణుగుల వుప్పును తయారు చేసితిమి. బహిరంగముగ అమ్మితిమి. రూ॥ 1000 లు సంపాదించితిమి."

గాంధీజీ పరవసించే అన్ని రంగాలలో అగ్రగామిగా నిల్చిన సీతానగర సత్యాగ్రహ ఆశ్రమం విచ్ఛిన్నం చేయాలనే దురుద్దేశం తోనే - ఆశ్రమం చట్ట విరుద్ధమని ప్రకటించింది ప్రభుత్వం.

1932 జనవరి 18న పోలీసు సూపర్నెంట్ 400 మంది రిజర్వ్ పోలీసుతో వచ్చి ఆశ్రమాన్ని ముట్టడించాడు. డిప్యూటీ పోలీసు సూపర్నెంట్ ముస్తఫా అలీ ఖాన్ సత్యాగ్రహులపట్ల క్రూరంగా వ్యవహరించేవాడని ప్రతీతి.

వచ్చీ రావడంతోనే ముస్తఫా అలీ ఖాన్ ఆశ్రమ వాసులందరినీ ఒకచోట చేర్చి The Ashram is declared as un-lawful body by the government. You are therefore all requested to disperse immediately (ఆశ్రమాన్ని అక్రమ సంస్థగా ప్రభుత్వం ప్రకటించింది. కనుక మీరందరూ యిక్కడనుండి వెళ్లిపోవాలి.) వెంటనే అన్నపూర్ణయ్య గంభీరస్వరంతో The Ashram is our home. We live or die here. Therefore we cannot disperse (ఆశ్రమం మాయిల్లు చచ్చినా బతికినా యిక్కడే. అందుచేత మేము బయటకు వెళ్లము.) అని సమాధానమిచ్చాడు.

అయిదు నిమిషాల పాటు పోలీసు లాఠీలు ఆశ్రమ వాసుల తలలపై నాట్యమాడాయి. అన్నపూర్ణయ్య, దీక్షితులు, కృష్ణమూర్తి, వెంకటప్పగార్లకు తలలు పగిలి రక్తం కారింది. అన్నగారిని కాపాడేందుకు కృష్ణమూర్తి అన్నపూర్ణయ్యను అలింగనం చేసుకున్నాడు. ఫలితంగా లాఠీదెబ్బలకు ఆయన స్పృహ కోల్పోయి ఆస్పత్రిలో రెండు నెలలు గడపాల్సి వచ్చింది.

పోలీసు అధికారి ముస్తఫా అలీఖాన్ క్షతగాత్రులైన వారి వైపు కన్నెత్తి చూడకుండా ఆశ్రమ ఆస్తిని విధ్వంసం చేయడంలో నిమగ్నుడైనాడు.

ఆశ్రమ వాసులందరితో పాటు అన్నపూర్ణయ్యగారికి నాలుగేండ్లు జైలు శిక్ష విధించబడింది. 1932 ఫిబ్రవరి 1 నుండి 1935 ఫిబ్రవరి వరకు కడలూరు, వేలూరు, రాజమండ్రి, బళ్లారి, తిరుచునాపల్లి జైళ్లలో అయన ఈ శిక్షాకాలం గడిపాడు.

పది సంవత్సరాలపాటు ఉజ్వలంగా వెలిగిన గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమం 1933

చివరన ముగింపు దశకు వచ్చింది. ఒక్కొక్కరే ఆశ్రమం వదలి వేరే కార్యక్రమాలలో నిమగ్నులైనారు.

ముందుగా మద్దూరి అన్నపూర్ణయ్య రాజమండ్రి చేరుకున్నాడు. క్రొవ్విడి లింగరాజు గారు ఆంధ్రకేసరి ప్రకాశం గారి "స్వరాజ్య"లో పనిచేయడానికి చెన్నపట్నం చేరాడు.

అసహాయోద్యమంలో నిర్బంధితులందరికంటే చివరగా - ఉద్యమం విరమింప బడిన పదినెలలకు - అన్నపూర్ణయ్యను విడుదల చేశారు. ప్రభుత్వం ఒక వివరణలో అన్నపూర్ణయ్య శిక్షకు హింసావాదం కారణం కాక పోయినా ఆతడు అతి ప్రమాదకరమైన దేశద్రోహిగా చిత్రింపబడటమే! (Though all political prisioners were released in Andhra an exception was made in regard to Madduri Annapoornaiah. The Govt. agreed that the offence under which he was convicted did not have violence his release was refused on the ground that he was dangerous. (page 84 The Freedom Struggle in A.P. M.Venkata Rangaiah.)

## సోషలిజం వైపు పయనం

1932-35 కాలంలో వివిధ జైళ్లలో అన్నపూర్ణయ్యగారికి చిత్ర విచిత్రానుభవాలు కలిగాయి. ఆకాలంలో సోవియెట్ రష్యా గురించీ సోషలిజం, మార్క్సిజం గూర్చి విస్తారంగా అవగాహన చేసుకునేందుకు ఆయనకు అవకాశం కలిగింది. సహచర ఖైదీలలో కొందరు మార్క్సిస్టులు ఆయనకు తారసపడినారు.

1936 సెప్టెంబరు 26,27 తేదీలలో రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ద్వితీయ మహాసభలు రాజమండ్రిలో జరిగాయి. మద్దూరి అన్నపూర్ణయ్య ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైనాడు. కాగా పుచ్చలపల్లి సుందరయ్య సహాయకార్యదర్శి.

అఖిల భారత కాంగ్రెసు సభలలో పరిచయమైన జయప్రకాశ్ నారాయణ్ మద్దూరి వారికి అత్యంత సన్నిహితులైనారు. జాతీయ స్థాయిలో ఆయన కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి. ఆంధ్ర దేశ పర్యటనలో అన్నపూర్ణయ్య జయప్రకాశ్ వెన్నంటి వుండేవాడు. "భారత దేశంలో సోషలిజాన్ని అర్థం చేసుకొని భాష్యం చెప్పగల ఏకైక వ్యక్తి జయప్రకాశ్"అని గాంధీజీ చేత ప్రశంసలు అందుకొన్న మహానాయకుడు జె.పి. ఆయన రాసిన why socialism అనే ఆంగ్ల గ్రంథాన్ని "సోషలిజం ఎందుకు" పేరిట మహీధర జగన్మోహనరావు శ్రీ మద్దూరి వారి సూచనపై అనువదించారు. అన్నపూర్ణయ్యగారు దానికి చక్కని పీఠిక రాశారు. ఇది రాయటానికి కారణం తెలిపే అంశం ఇది.

జమీందారీలు రద్దు కావాలి. ప్రభుత్వానికి రైతుకూ మధ్యనున్న దళారీలందరూ పోవాలి. దోపిడీ విధానం నశించాలి అని జయప్రకాశ్ సోషలిస్టు విధానాలను ప్రచారం చేసేవారు. జమీందారీ వర్గం ఈ విషయమై గాంధీజీతో చర్చించినపుడు గాంధీజీ అట్టిదేమీ సాగదు. అట్టి స్థితే వస్తే మీ పక్షాన నిల్చి నేను పోరాడతానన్నాడు. నేను పోరాడటం మీరు చూస్తారన్నాడు గాంధీజీ. జమీందార్లు

ధర్మకర్తలని నిర్వచించాడు గాంధీజీ. "సోషలిజం ఎందుకు" లో ఈ విషయాలన్నీ చక్కగా వివరించారు జయప్రకాశ్. ఏలాటి పరిహారం లేకుండానే జమీందారీలు రద్దు కావాలని నినాదమిచ్చారు జయప్రకాశ్. అన్నపూర్ణయ్యకు రష్యానేత లెనిన్ అంటే అపారగౌరవం. "జోహారులందుకో జోదు మా లెనిన్" అనే గేయం కూడా రాశాడు. (చూ.అనుబంధం) జయప్రకాశ్‌ను "భారత లెనిన్" గా కీర్తించాడు అన్నపూర్ణయ్య.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి అయిన అన్నపూర్ణయ్య కాంగ్రెసు సోష లిస్టు పార్టీ నియమావళిని ప్రకటించి 1937 మార్చిలో ముద్రించాడు. దీనిలో ప్రధాన సూత్రాలిలా వున్నాయి.

1. కాంగ్రెసులో సభ్యులుగా ఉన్నవారే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యత్వానికి అర్హులు.
2. మార్క్స్ సిద్ధాంతములను అంగీకరించాలి. వర్గపోరాటం యొక్క శాస్త్రాన్నీ, అభ్యాస విధుల్నీ తెలుసుకోవాలి.

అఖిల భారత కాంగ్రెసు సోషలిస్ట్ కార్యక్రమం ఆదర్శాలిలా ఉన్నవి:

1. ఉత్పత్తి దారులగు జనసామాన్యమునకు రాజ్యాధికారము వశము చేయుట.
2. దేశ ఆర్థిక జీవితాన్ని ప్రభుత్వమే నియమిత పద్ధతి ప్రకారం నడుపుచూ అభివృద్ధి పరచుట.
3. ఉత్పత్తి పంపకము మారకముల అన్ని సాధనములను క్రమేణా సంఘపర మొనర్చుట.
4. విదేశీ వ్యాపారములను ప్రభుత్వమే జరపాలి.
5. సహకార పరపతి సంఘాలు నెలకొల్పాలి.
6. సంస్థానాలు జమిందారీలు ముదరాలేకుండా రద్దు పరచాలి.
7. కర్షకులకు భూమిని తిరిగి పంచాలి.
8. సహకార వ్యవసాయాన్ని ప్రోత్సహించాలి.
9. కార్మిక కర్షకుల అప్పు రద్దు చేయాలి.
10. పనిచేసే హక్కు గుర్తించాలి. లేక ప్రభుత్వమే పోషణ బాధ్యత వహించాలి.
11. శక్తి కొద్దీ పని – అవసరం కొద్దీ ప్రతిఫలం సూత్రం అంగీకరించాలి.
12. మేజర్లందరికీ ఓటింగ్ హక్కు.
13. ప్రభుత్వం కుల మత పక్షపాతానికి తావీయరాదు.
14. నర నారీ భేదాలు ప్రభుత్వం పాటించరాదు.
15. పబ్లిక్ డెట్ ఆఫ్ ఇండియాను ఎగవేయాలి.

ఇంకా పార్టీ పనిచేసే విధానం రాజకీయంగా వ్యావసాయికంగా కోరదగు 30 డిమాండ్లను కూడా ఇందులో పొందుపర్చారు.

## జయప్రకాశ్: అన్నపూర్ణయ్య

జయప్రకాశ్ జీవితానికీ అన్నపూర్ణయ్య జీవితానికీ చాల సామ్యం వుంది. ఇరువురు నేతలు యువజనులను ఆకర్షించుటలో సిద్ధహస్తులు. జాతీయోద్యమంలో వామపంథా ననుసరించి కఠిన నిర్బంధాలకు గురియైన త్యాగధనులు. తొలిదశలో గాంధేయులు. తరువాత మార్క్సిజం అధ్యయనశీలురు. జయప్రకాశ్‌ను గూర్చి 'వెలుగు' (27-4-1954)లో మద్దూరి అన్నపూర్ణయ్య ఇలా రాశాడు "1953 వేసవిలో జె.పి. పూనాలో 21 రోజుల ఉపవాసం చేసి ఆ తపో సమయమున నాస్తికత్వము నుండి ఆస్తికత్వమునకు పూర్తిగా మారెను. 1953 సెప్టెంబరులో బొంబాయిలో జరిగిన సోషలిస్టు జనరల్ కౌన్సిల్" అధిభౌతికవాదం నా సమస్యలను పరిష్కరింపజాలక పోయింది. నేడు నేను మార్క్సిస్టును కాను. అని ఉద్ఘాటించాడు. మానవునికి మానవునికి మధ్య ప్రేమబంధం గాఢంగా వుండాలి. జయప్రకాశ్ నిర్ణయం దివ్యమైనది. కేవల నాస్తికుడు పరమాస్తికుడై ప్రేమ తత్త్వాన్ని శరణుజొచ్చాడు. మహాపురుషులందరికీ గమ్య మిదేగా! ఆ గమ్యాన్ని చేరుకోగలిగిన జయప్రకాశ్ కివే మా జోహార్లు. "జె.పి.ని గూర్చి అన్నపూర్ణయ్య రాసిన వాక్యాలు తనకూ అన్వయిస్తాయి. ప్రజాసేవలో 33 ఏండ్ల పిమ్మట (1953 డిసెంబరు 2న) తాను ఏ పార్టీకి చెందనని అన్నపూర్ణయ్య ప్రకటించాడు.

ఆత్మ విచారణ మార్గంలో గురువును వెతుక్కుంటూ అన్నపూర్ణయ్య మెహర్‌బాబా శిష్యుడైనాడు.

## యువజన శిక్షణా శిబిరాలు

గాంధీజీ ఆశీస్సులతోనే 1934లో జయప్రకాశ్ నారాయణ్ ప్రభృతులు కాంగ్రెసులో అంతర్భాగంగా - కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించారు. 1937 లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వుండేది. కమ్యూనిస్టులు అంతర్గతంగా బలం పుంజుకోవచ్చునని కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చొచ్చుకొని పోయారు. ఆంధ్ర యువకులకు నూతన రాజకీయ దృక్పథం అలవడేటట్లు చేయాలనే ఆలోచనతో 1937 మే 1 న కొత్తపట్నం వాలంటీర్ల శిక్షణా శిబిరం నిర్వహించారు.

ఒంగోలుకు తూర్పున 10 మైళ్ల దూరములో సముద్రతీరమైన కొత్తపట్నం ఈ శిబిరానికి అనువుగా వుంటుందని భావించారు. ఈ శిబిరంలో 170 మంది వాలంటీర్లు చేరారు. వీరిలో పుచ్చలపల్లి సుందరయ్య, కొల్లా వెంకయ్య, మాకినేని బసవపున్నయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, పిడతల రంగారెడ్డి ప్రభృతులుండేవారు. ఇందూలాల్ యాజ్ఞిక్, జహీరు, జొరాబేగం, స్వామి సహజానంద సరస్వతి, ఆచార్య రంగా, జయప్రకాశ్ నారాయణ్, అచ్యుత పట్వర్ధన్, బాట్లివాలా, సి.పి. అల్లాంగో మున్నగు ప్రముఖులు విచ్చేసి ఉపన్యాసాలిచ్చారు.

ఆంధ్రరత్న శిష్యరత్నం జనాబ్ గౌస్‌బేగు వాలంటీరు దళాధిపతి. చంద్ర రాజేశ్వరరావు వాలంటీర్లకు డ్రిల్లు, అన్నాప్రగడ కామేశ్వర రావు గెరిల్లా పద్ధతులు

నేర్పేవారు. అల్లూరి సత్యనారాయణరాజు, ఆయన సతీమణి, అన్నాప్రగడ కామేశ్వరరావు ఆయన సతీమణి ఇందులో పాల్గొన్నారు.

ఈ శిబిర నిర్వహణ బాధ్యత – అన్నాప్రగడ కామేశ్వరరావు, మద్దూరి అన్నపూర్ణయ్య, అల్లూరి సత్యనారాయణరాజు, నేతి చలపతి, సాగి విజయరామరాజు వహించారు.

స్థానికుల తోడ్పాటుతో జయప్రదంగా సాగుతున్న ఈ శిబిరాన్ని ప్రభుత్వం నిషేధించింది.

1937 మే 21న గుంటూరు జిల్లా కలెక్టరు వెల్లోడి రెండు వ్యాన్ల రిజర్వుతో వచ్చి శిబిర వాసులను లాఠీఛార్జి చేశారు. అన్నాప్రగడ వారికి అన్నపూర్ణయ్యకు బాగా దెబ్బలు తగిలాయి. భారత జాతీయ కాంగ్రెసు ఆవిర్భావాన్ని గూర్చి అన్నపూర్ణయ్య శిబిరవాసులకు ఉపన్యాసాలిచ్చారు.

1942 లో అన్నపూర్ణయ్యకు అందజేసిన ఛార్జిషీటులో నిషేధిత శిబిరంలో కమ్యూనిజం గూర్చి బోధించాడని ఒక ఆరోపణ. తాను ప్రసంగాలు ముగించిన పిమ్మట శిబిరం నిషేధింపబడిందనీ కమ్యూనిజంపై తాను ప్రసంగించలేదని అన్నపూర్ణయ్య ప్రభుత్వ ఆరోపణ ఖండించాడు.

1938 మే 4న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఆధ్వర్యాన మంతెనవారిపాలెంలో (గుంటూరు జిల్లా) అన్నాప్రగడ కామేశ్వరరావు యువజన శిక్షణా శిబిరాన్ని నిర్వహించాడు. ఈ శిబిరం ప్రభుత్వ నిషేధానికి గురికాలేదు. అన్నపూర్ణయ్య ఈ శిబిరంలోనూ జాతీయోద్యమం సోషలిజంగూర్చి ప్రసంగాలు చేశాడు. అన్నపూర్ణయ్యతోపాటు మాడభూషి వెంకటాచారి, చంద్ర రాజేశ్వరరావు, సి.వి.కె. రావు, కంభంపాటి సత్యనారాయణ, పి.వి. శివయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య అధ్యాపకులుగా వున్నారు. ఎస్.ఎ. డాంగే, పి.సి. జోషి, అధికారి గార్లు విచ్చేశారు.

ఈ శిబిరంలోనే పాల్గొన్న శ్రీ మాదల వీరభద్రరావు తాను రాసిన గేయం అన్నపూర్ణయ్య తానే పాడుతూ మాకెంతో స్ఫూర్తి కలిగించారని తెలిపారు. ఆ గేయమిది:

"కూలివాళ్లము మనము, కూలివాళ్లము మనము
కూడు గుడ్డాలేక కుమిలి పోతున్నాము
మేడాలు కట్టాము – మిద్దేలు కట్టాము
*కూకుంటకైనను – గుడిసైన లేదండి –"* (కూ॥ వాళ్లము)

1936–37 లలో అన్నపూర్ణయ్య ఉభయ గోదావరి జిల్లాలలో విస్తృతంగా పర్యటించి చాలమంది యువకులను సోషలిజంవైపు ఆకర్షించాడు. బట్టగుండులో జరిగిన తమిళనాడు కాంగ్రెసు సోషలిస్టు మహాసభకు అధ్యక్షత వహించాడు. ఏలూరులో జరిగిన పశ్చిమ గోదావరి జిల్లా రాజకీయ మహాసభ శ్రీమతి కమలాదేవి ప్రారంభించగా అన్నపూర్ణయ్య అధ్యక్షత వహించాడు.

ఈ కాలంలోనే రాజమండ్రి అల్యూమినియం వర్కర్సు, ప్రెస్సు వర్కర్సులను సంఘటితపరచి – ఆయా యూనియన్లకు అధ్యక్షుడై కార్మికుల సంక్షేమానికి మిక్కిలి కృషి సలిపాడు అన్నపూర్ణయ్య.

## ఆంధ్ర నేతాజీ

1928 డిసెంబరులో కలకత్తా కాంగ్రెసు మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన జరిగింది. అఖిల భారత కాంగ్రెసు సభ్యుడుగా మద్దూరి అన్నపూర్ణయ్య హాజరైనాడు. అక్కడే జరిగిన యువజన మహాసభకు సుభాస్‌బోసు అధ్యక్షుడు. కాంగ్రెసు మహాసభ వాలంటీరు దళాధిపతి కూడా అతడే! అప్పుడే వీరసింహుడైన సుభాసుబోసుతో అన్నపూర్ణయ్యకు తొలిసారిగా పరిచయమైంది. నాటి నుండి ఆయన పట్ల భక్తి కుదిరింది. నెహ్రూ బోసులలో, గాంధీజీ, నెహ్రూపట్ల పక్షపాత వైఖరి నవలంబించే వాడని అన్నపూర్ణయ్యకు తోచేది.

1938 లో కాంగ్రెసు అధ్యక్షపదవికి పోటీ డాక్టరు పట్టాభి, సుభాసుబోసుల మధ్య జరిగింది. ఆంధ్రుడని పట్టాభిపట్ల పక్షపాతం చూపక సిద్ధాంతపరంగా తనకు నచ్చిన బోసు పక్షాన్నే పనిచేసి ఆయన విజయానికి తోడ్పడినాడు అన్నపూర్ణయ్య.

1939 సెప్టెంబరు 3వ తేదీన రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైనది. ఈ వార్త విద్యార్థులలో యువకులలో గొప్ప సంచలనం కలిగించింది. సరిగ్గా అదే రోజు సుభాసుబోసు రాజమండ్రి విచ్చేశాడు. 1939 మార్చిలో త్రిపుర కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికైన బోసుబాబుకు కాంగ్రెసులో మితవాద వర్గం అడ్డంకులు కల్గించింది. ఫలితంగా బోసు రాజీనామా యిచ్చాడు. క్రమశిక్షణ పేరిట ఆయనను మూడు సంవత్సరాలు బాధ్యతాయుత స్థానాలనుండి బహిష్కరించింది కాంగ్రెసు. ఆయన అప్పుడు ఫార్వర్డు బ్లాకును స్థాపించి దక్షిణదేశ పర్యటనకు విచ్చేశాడు. ఆంధ్ర తమిళనాడు కాంగ్రెసు సంఘాలు; బోసుకు ఎలాటి స్వాగత సత్కారాలు అందజేయరాదని సర్క్యులర్‌లు కూడా జారీ చేశాయి. రాజమండ్రిలో కొందరు కాంగ్రెసు పెద్దలు పట్టణం వదలి వెళ్లిపోగా దేవత రామమోహనరావుగారు ముందుకు వచ్చి బోసుకు తన ఇంట అతిథ్యమిచ్చారు. న్యాయవాదియైన వీరే హైకోర్టు దాకా వెళ్లి కాంగ్రెసు జండా తన ఇంటిపై ఎగురవేసుకొనే హక్కును సాధించుకున్నారు.

రాజమండ్రి పాల్‌చౌక్‌లో బోసు అనాడు చేసిన మహోపన్యాసాన్ని అన్నపూర్ణయ్య తెలుగులో అనువదించాడు. బోసు బాబుతో సరితూగే అనువాదానికి అన్నపూర్ణయ్యకు ప్రజానీకం జేజేలు పలికారు. నాటినుండి ఆయనను "ఆంధ్రనేతాజీ" అని పిలువసాగారు.

ఆంధ్రలో అన్నపూర్ణయ్య మాదిరిగా, తమిళనాడులో ముత్తు రామలింగదేవరు స్థానిక కాంగ్రెసు సంఘం ఆదేశాలను ధిక్కరించి తమిళనాట బోసుకు అఖండ స్వాగతం అందజేశాడు.

ఫార్వర్డు బ్లాకును గూర్చి అన్నపూర్ణయ్య తాను 14–1–1942 తేది పంపుకున్న డిఫెన్సు స్టేటుమెంటులో ఇలా రాసాడు:

"ఫార్వర్డు బ్లాకు బహిరంగంగా పనిచేస్తూ శాంతియుత చట్టబద్ధమైన మార్గాలద్వారా భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యానికి కృషి చేస్తుంది. నేను అక్షరాలా దీనికి కట్టుబడివున్నాను. దీని నుండి వేరు పడాల్సిన అవసరం నాకు కన్పించటంలేదు. బోసు దేశం నుండి అంతర్ధానమయ్యే ముందు మహాత్మాగాంధీ ప్రతిపాదించిన వ్యక్తి సత్యాగ్రహానికి (దాని పరిధి అల్పమయినప్పటికీ) ఫార్వర్డు బ్లాకు పూర్తి మద్దత్తు నిస్తుందని ప్రకటించాడు. అఖిల భారత ఫార్వర్డు బ్లాకు కార్యదర్శిగా నున్న ముకుందలాల్ సర్కారు, బోసుపై పార్లమెంటులో వచ్చిన ఆరోపణలు ఖండిస్తూ భారతదేశంపై విదేశీ దండయాత్ర నిరోధించడమే తన పార్టీ లక్ష్యమని పేర్కొన్నాడు. ఇటీవల కొందరు ఫార్వర్డు బ్లాకు సభ్యులు బెంగాల్ మంత్రివర్గంలో చేరారు. అందుచేతనే ఫార్వర్డు బ్లాకును చట్టవిరుద్ధమైనదిగా ప్రభుత్వం ప్రకటించలేదు."

## యాంటి కాంప్రొమైజు కాంగ్రెసు

1940 మార్చిలో 53వ అఖిలభారత కాంగ్రెసు కమిటీ బీహారులోని రాంఘేరులో, మౌలానా అబుల్ కలాం ఆజాద్ అధ్యక్షతన జరిగింది. ఫార్వర్డు బ్లాకు కిసాను సభలు – కిసాన్ నగరు అనే ప్రదేశంలో – సమాంతరంగా జాతీయ కాంగ్రెసు కంటే ముందే జరిగాయి. అశేష జనం పాల్గొన్నారు. పోరాటానికి సిద్ధంగా నున్నారా? అని అధ్యక్షులు బోసు చేసిన ప్రతిపాదనకు ఆమోదం తెలుపుతూ వేల సంఖ్యలో ప్రతినిధులు చేతులెత్తారు. సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాటం తలపెట్టిన ఈ సభ "యాంటి కాంప్రొమైజ్ కాంగ్రెసు"గా పిలువబడింది. అఖిల భారత స్థాయిలో యాక్షన్ కమిటీ నియమించడానికి అధ్యక్షునికి అధికారమిస్తూ తీర్మానించారు. ఏప్రిల్ నెలలోనే పోరాటం ప్రారంభం కావాలనీ, ఒకసారి మొదలయిన తరువాత ఆగటం అంటూ వుండరాదనీ, విరామంగాని పక్కదారి బట్టడం – గాని జరగరాదని నిర్ణయించారు. స్థానిక సమస్యలను కూడా ఉధృతం చేయాలని సంకల్పించారు. సుభాసుబోసు నియమించిన యాక్షన్ కమిటీలో మద్దూరి అన్నపూర్ణయ్య ఒకరు.

1939లోనే బోసుబాబు – ఆంధ్ర ఫార్వర్డు బ్లాకు అధ్యక్షునిగా, జాతీయ కార్యవర్గ సభ్యునిగా అన్నపూర్ణయ్యను నియమించాడు.

## నవశక్తి

ఒకనాటి అగ్రహారము
ఈనాటికి మాన్యమయ్యె
తుదకే మగునో
నానాటికి తీసికట్టు నాగం భొట్లూ.

ఉపన్యాస కేసరి చెరుకువాడ వెంకట నరసింహంగారొకసారి ఘంటశాల బంధువుల ఇంటి వివాహవిందులో పాల్గొన్నారు. నేయి వడ్డనకు వచ్చింది. సోమసూత్రం (చెంబుకు ఒక గొట్టం అమర్చి వుంటుంది) వైపు తదేకంగా చూస్తున్నాడు

పంతులుగారు. వడ్డించే కుర్రవాడు వారిని అడిగాడు – ఏమిటండీ వింతగా చూస్తున్నారని. "ఏమిలేదురా అబ్బాయి మనవారి మాన్యాలన్నీ ఈ తూముగుండానే కదా పోయాయని" పంతులుగారి చతురోక్తికి భోక్తలందరూ నవ్వుకొని ఆనందించారు.

ఒకప్పుడు సంపన్న కుటుంబీకులైన మద్దూరి వారి ఆస్తిపాస్తులు అన్నపూర్ణయ్యగారి హయాం వచ్చేసరికి పిత్రార్జితం ఆయన వాటా రెండు ఎకరాలు మిగిలింది.

సీతానగర ఆశ్రమవాసులు సోమరులులాగా జీవిస్తున్నారనీ డాక్టర్ సుబ్రహ్మణ్యం వీరికోసం విరాళాలు సేకరించడంలో కష్టపడుతున్నారనీ వదంతులు పుట్టాయి. అవి అన్నపూర్ణయ్య చెవి దాకా వచ్చాయి. ఆయన తక్షణం ఆశ్రమం నుండి బయటపడాలని నిశ్చయించుకున్నాడు.

1935 జూలై 7న రాజమండ్రి చేరుకున్నాడు. విచారంతోనే ఆశ్రమవాసులు ఆయనకు వీడ్కోలు చెప్పారు. తన పిత్రార్జితం రెండు ఎకరాలు అమ్మివేశాడు. ఆ వచ్చిన డబ్బుతో ఒక పత్రిక నడపాలని నిశ్చయించుకున్నాడు.

స్తబ్దులుగా పడివున్న జనానికి చైతన్యం కలిగించడం పత్రిక లక్ష్యంగా వుండాలని ఆయన భావన.

నూతన పత్రికకు 'నవశక్తి' అని నామకరణం చేశాడు. స్వంత బాధ్యతపై నడిపేందుకు డిక్లరేషను తీసుకున్నాడు.

1937 డిసెంబరు 15న 'నవశక్తి' మొదటి సంచిక కారల్ మార్క్స్ ముఖచిత్రంతో వెలువడింది. 'కార్మిక కర్షకులారా ఏకముగండు' అనే నినాదం కూడా ప్రముఖంగా ముద్రించారు. పండిత జవాహర్‌లాల్ నెహ్రూ, జయప్రకాశ్ నారాయణ్ ప్రభృతులు 'నవశక్తి'ని ఆశీర్వదించారు.

'నవశక్తి' పత్రిక ఆశయాన్ని అన్నపూర్ణయ్య ఇలా వివరించాడు. "ఇది సోషలిస్టు విధానాన్ని అందిస్తుంది. కాంగ్రెసు స్వాతంత్ర్యపోరాటాన్ని బలపరుస్తుంది. సామ్రాజ్యవాదాన్ని చీల్చి చెండాడడానికి సాయపడుతుంది."

తొలుత అన్నపూర్ణయ్య వ్యక్తిగతంగా ప్రారంభించిన 'నవశక్తి', కాంగ్రెసు సోషలిస్టు అధికార పత్రికగా వెలువడసాగింది.

అప్పట్లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం మూలంగా పుచ్చలపల్లి సుందరయ్య ప్రభృతులు కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో వుండేవారు. మద్దుకూరి చంద్రశేఖరరావు తుమ్మల వెంకట్రామయ్య గార్లు అన్నపూర్ణయ్యతోపాటు సంపాదక వర్గంలో వుండేవారు. 1938 చివరకు సంపాదకవర్గ సభ్యుల సంఖ్య పెరిగింది. అన్నపూర్ణయ్య మినహా మిగతావారందరూ కమ్యూనిస్టులే! చివరకు అన్నపూర్ణయ్య నవశక్తితో తన సంబంధాలు తెగతెంపులు చేసుకున్నాడు.

## జైలుజీవితం చివరిమజిలీ

1940 మార్చిలో రాంఘేర్‌లో జరిగిన యాంటి కాంప్రామైజ్ కాంగ్రెసు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ఏప్రిల్‌లోనే ప్రారంభం కావాలని చేసిన తీర్మానం మేరకు కార్యవర్గ సభ్యుడైన అన్నపూర్ణయ్య తన కార్యకలాపాలు వుధృతం చేశాడు.

అప్పటికి రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమై 6 నెలలు కావచ్చింది. రాజమండ్రిలో బహిరంగ సభలో ప్రజలను ప్రబోధిస్తున్న అన్నపూర్ణయ్యను 1940 ఏప్రిల్ 6 వ తేదీన డిటెన్యూగా నిర్బంధించారు.

ఇప్పటికే ఆయన 8 సంవత్సరాలు జైలులలో గడిపివచ్చారు. మొదటి నాలుగు సంవత్సరాలు 'కాంగ్రెసు' పత్రికలో రచనకు ప్రచురణలకుగాను, మరొక నాలుగు సంవత్సరాలు అసహాయోద్యమ కాలంలో సీతానగర ఆశ్రమంపై దాడి సందర్భంగాను. నేరారోపణపై శిక్ష అయితే ఎంతకాలం జైలులో గడపాలో తెలుస్తుంది. డిటెన్షన్ అట్లాకాదు. నిర్బంధితునికి కారణం చెప్పరు. ఎప్పుడు విడుదల అవుతారో అంతకన్నా తెలీదు. ఉన్నపళంగా హుటాహుటిన గోదావరి స్టేషను తీసుకవెళ్లి మద్రాసు మెయిల్ ఎక్కించారు. ఆయనకు ఒక జత వస్త్రాలు సంచిలో పెట్టుకొని భార్యాబిడ్డలు రైలుస్టేషనుకు వస్తే వారిని సైతం అన్నపూర్ణయ్యతో మాట్లాడడానికి దగ్గరకు రానీయలేదు.

స్వంత విషయాలు ఎన్నో మాట్లాడవలసినవి వున్నవని ప్రాధేయపడగా బావమరది కొల్లూరి కృష్ణశాస్త్రిగారిని బెజవాడ వరకూ అనుమతించారు.

1940 ఏప్రిల్ 6న డిటెన్యూగా నిర్బంధింపబడిన అన్నపూర్ణయ్యను 1945 జూన్‌లోగాని విడుదల చేయలేదు. ఈ ఆరేండ్లలో అధిక భాగం వేలూరు జైలులోనే గడిచింది. మధ్యకాలంలో (1943)లో మధ్యప్రదేశ్‌లోని 'దమో' జైలులో వుంచారు. ఆకాలంలోనే ఆయన భార్య కాలధర్మం చెందింది. 1942 నవంబరులో ఆయన రాజమండ్రి జైలుకు బదిలీ అయిన సందర్భంలో తనను ఇంటర్వ్యూ చేయటానికి అనుమతించవలసిందిగా 15 మంది పేర్లు యిచ్చాడు. ఇందులో పదకొండుమంది బంధువులుకాగా నలుగురు ఆత్మీయులు. వారెవరనగా:

**జె.వి.కె. వల్లభరావు:** ఆంధ్రాయూనివర్సిటీ ఆనర్సు ఫైనల్ విద్యార్థి - దత్తపుత్రుడు కానీ రక్తసంబంధీకుడు కాడు. కానీ చాలామంది రక్తసంబంధీకులకంటే సన్నిహితుడు. యదార్థానికి కన్న కొడుకుతో సమానుడు.

**జె.వి. లక్ష్మి:** యం.బి.బి.ఎస్. విద్యార్థిని వల్లభరావు భార్య. కాబట్టి నా కోడలు' నా స్వంత కూతురు లాంటిది.

**నాళం వెంకట్రాయుడు:** కాకినాడ వాస్తవ్యుడు రాజకీయాలతో ఎలాటి సంబంధం లేనివాడు. ప్రాణప్రదమైన మిత్రుడు.

**కె. సీతాదేవి:** బొంబాయి మెడికల్ కాలేజి విద్యార్థిని. దత్తపుత్రిక. రాజకీయాలతో ఏ సంబంధంలేదు.

ఈ సందర్భంగా అన్నపూర్ణయ్య - ప్రభుత్వం, కేవలం రక్తసంబంధీకులే ఆత్మీయులని భావించరాదని కొన్ని సందర్భాలలో స్నేహితులే బంధువులకంటె సన్నిహితులై కుటుంబంలో ఒకరుగా మెలగుతారని తెలిపాడు.

మద్రాసు రాష్ట్రంలోనే యుద్ధకాలంలో డిటెన్యూగా నిర్బంధింపబడిన వారిలో అన్నపూర్ణయ్య ప్రథముడు. సహచర ఖైదీలందరూ ఆయనకు వేలూరు డిటెన్షన్ నగర మేయరుగా ఎన్నుకున్నారు. ఒక కథలో అన్నపూర్ణయ్య 'మేయరు' స్థానాన్ని గూర్చి ఇలా తెలిపాడు. "డిటెన్యూనగరానికి మేయరంటే సామాన్యుడుకాడు. జైలు అధికారులు మేయరు ద్వారానే డిటెన్యూలను పాలించాలి కాని నేరుగా కాదు. ఆయన వద్ద ఒక అర్డర్లీ వుంటాడు. డిటెన్యూలు వ్రాసుకున్న ఉత్తరాలు ముందుగా (సెన్సారు నిమిత్తం) ఆఫీసులో ఇవ్వడం, డిటెన్యూలకు వచ్చిన వుత్తరాలు మేయరుకు ముందుగా ఇవ్వడం అర్డర్లీ పని. అన్నపూర్ణయ్య తనను ఇతర సోదర ఖైదీలను డిటెయిన్ చేసిన కారణాలను తెలియజేయాలని పలుసార్లు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు. తనను బేషరతుగా విడుదల చేసి న్యాయస్థానంలో విచారణ జరిపించాల్సిందిగా ఆయన డిమాండు చేశాడు. కనీసం న్యాయ ట్రిబ్యునల్ ఏర్పాటు చేసి తమ వాదన వినిపించే అవకాశం కల్పించమని కోరాడు.

వీరి విజ్ఞప్తికి సమాధానంగా ప్రభుత్వం; 1941 డిసెంబరు 17న డిటెన్యూలందరకు హైకోర్టు జడ్జీ నొకరిని విచారణకు నియమించిందనీ ఖైదీలందరూ లిఖితపూర్వకంగా తమ తమ స్టేటుమెంట్లు పంపుకోవచ్చుననీ అయితే న్యాయవాది ఏర్పాటుకు అంగీకరించమని స్పష్టంగా తెలిపారు.

ఈ ఉత్తర్వు అందుకొన్న డిటెన్యూలందరూ తమ నిర్ణయం పునఃపరిశీలించ వలసిందిగా ప్రభుత్వాన్ని కోరారు. ఇది ఇలా వుండగా 1942 జనవరి 3న మద్రాసు గవర్నరు సలహాదారు టి.జి. రూథర్‌ఫర్డు వేలూరు జైలును సందర్శించారు. అన్నపూర్ణయ్య రూథర్‌ఫర్డును నేరుగా కలిసికొని విన్నవించగా ఫలితంలేకపోయింది. లిఖిత ప్రకటనలలో సైతం న్యాయవాది ప్రమేయం అనుమతించమని జైలు సూపర్నెంట్ అన్నపూర్ణయ్యకు స్పష్టం చేశాడు. ఈ కారణంగా 1942 జనవరి 10 న ప్రముఖ న్యాయవాది బచ్చు జగన్నాథదాసు స్నేహపూర్వకంగా కలిసికొన్నప్పటికీ వారితో ఈ విషయం ప్రస్తావించటానికి అవకాశం లేకపోయింది.

ఆచార్య రంగా గారు ఆ దినాలలో కేంద్ర శాసనసభలో సభ్యులు. ఈ విషయంలో సలహా ఇవ్వమని మహాత్మాగాంధీగారికి రంగాగారు పంపిన టెలిగ్రాం బాపూజీకి చేరకుండా చేశారు. చివరకు రంగా గారు స్వయంగా గవర్నరు సలహాదారు రూథర్‌ఫర్డును కలిసినా ప్రయోజనం లేకపోయింది.

చివరకు నిరసన తెలుపుతూనే తన స్టేటుమెంటు పంపుకొంటున్నానని తాను న్యాయశాస్త్ర పరిజ్ఞానం లేని సామాన్యుడననీ, తన స్టేటుమెంటు సత్యపూరితమైనదనీ, ప్రభుత్వం మోపిన అన్ని ఛార్జీలు ఖండించబడినందున తన విడుదలకు ఉత్తర్వు చేయమనీ అన్నపూర్ణయ్య 14-1-1942 తేదీన విజ్ఞప్తి చేశాడు.

అన్నపూర్ణయ్య తనపై మోపబడిన నేరాలను అన్నిటినీ ఖండిస్తూ స్పష్టమైన భాషలో జవాబిచ్చారు. వాటిలో కొన్ని పరిశీలిద్దాం.

"హిందూదేశము పూర్వ ప్రస్తుత పరిస్థితులు అనే కరపత్రం వ్రాసిన మాట నిజమే. 1921లో నేను దానిని ప్రచురించాను. అది తరువాత నిషేధింపబడిందని విన్నాను. కాని నాకెలాంటి నిషేధపుటుత్తరము రాలేదు. అది వ్రాసినందుకు నన్ను

ప్రాసిక్యూట్ చేయలేదు. చేసివుంటే అనాడే చెప్పేవాడిని, దానికి ఆధారగ్రంథం How India wrought for freedom అన్న అనిబిసెంట్ రచన" అని. అది చట్టబద్ధమైన ప్రచురణ. ఆ దినాల్లో అత్యంత ప్రచారంలో వుండేది. మహాత్మాగాంధీ 1920లో ఆదేశించిన అసహాయోద్యమంలో ప్రముఖంగా పాల్గొన్నారనే ఆరోపణకు బదులు చెబుతూ – "గాంధీ ఉద్యమానికి అహింస మూలకందం. దాని కార్యకలాపాలన్నీ బహిరంగంగా ముందుగా నోటీసులు ఇచ్చి జరుగుతవి. నేను 22 సంవత్సరాలుగా కాంగ్రెసువాదిగా వుంటూ దేశ సేవలో బహిరంగంగా పాల్గొంటున్నాను." దేశ ద్రోహం పురిగొల్పే ప్రసంగాలు చేసినందుకు శిక్షించడం, కాంగ్రెసు పత్రికలో నా రచనలకై నన్ను శిక్షించడం – ఇవన్నీ నా చర్యలన్నీ బహిరంగమైనవేనని చెప్పక చెబుతున్నాయి.

యువజనోద్యమానికి ఊతమిస్తానన్న నేరం కూడా నా కార్యకలాపాలు బహిరంగమైనవేనని తెలుపుతాయి. మహాత్మాగాంధీ "యంగ్ ఇండియా" యువకులకు స్ఫూర్తి నిచ్చేది. జవాహర్‌లాల్ మహోన్నత వ్యక్తిత్వం యువకులకు గొప్ప ఆకర్షణ.

నాకు సోషలిస్టు భావాలున్న మాట సత్యమే! ప్రపంచంలో ఎక్కడా కూడా సోషలిస్టు లేక కమ్యూనిస్టు భావాలు కలిగి వుండటం అభ్యంతరకరం అని భావింపబడటం లేదు. నెల్లూరు జిల్లా యువజన సభలో సోషలిజం గూర్చి సోవియట్ యూనియన్ గూర్చి ప్రసంగించిన మాట వాస్తవమే! సాంఘిక ఆర్థిక అసమానతలను తొలగించిన రష్యాను ప్రశంసిస్తూ పండిట్ నెహ్రూ "సోవియట్ రష్యా" అను ఉద్గ్రంథం వ్రాయలేదా! అంతేకాదు విశ్వకవి ఠాగూరు సైతం రష్యాను తన కవితలలో శ్లాఘించిన వాడు కాడా! లక్నోలో కమ్యూనిస్టు ప్రదర్శనలలో పాల్గొన్నాననే ఛార్జి తప్పు. అక్కడ ప్రదర్శనలే జరగలేదు. అఖిలభారత కాంగ్రెసు సభ్యుడుగా – ఎన్నో సంవత్సరాలుగా – నేను లక్నో ఎ.ఐ.సి.సి. విషయ నిర్ణాయక సంఘంలోనూ బహిరంగ సభల్లోను ప్రముఖంగా పాల్గొన్న మాట సత్యమే. అక్కడ జరిగినవి రెండు మహాసభలు. కాంగ్రెసువాదులు మంత్రిపదవులు చేపట్టరాదని తీర్మానించిన "మంత్రివర్గ వ్యతిరేక సదస్సు ఒకటి. రెండవది అఖిలభారత కిసాన్ సమ్మేళనమున్నూ ఇకపోతే ప్రదర్శనలు జరిగినదెక్కడ?

1936 ఆంధ్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా ఎన్నుకోబడినాను. ఆ హోదాలో నేను రాష్ట్రమంతటా పర్యటించాను. అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టు మహాసభ (పాలకొల్లు)లో పాల్గొన్నాను. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిషేధిత పార్టీ కాదని అందరికీ తెలుసు. నన్ను అనేక సభలకు అధ్యక్షత వహించవలసిందిగా ఆహ్వానించగా – నేను తమిళనాడులోని బుట్టగుండు సహా – వెళ్లడం నా కార్యకలాపాలు బహిరంగమైనవనే చాటుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ పర్యటనలో జయప్రకాశ్, బాట్లివాలా, యస్.ఏ. డాంగే, కమలాదేవిలను అనుసరించి వెళ్లానని ఆరోపించారు. దానిలో తప్పు ఏమిటి? వీరందరూ అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గ సభ్యులే!"

అన్నపూర్ణయ్య తనపై ఆరోపించబడిన నేరాలన్నిటికీ సమాధానమిచ్చి చివరగా

"తానెటువంటివాడినని తెలిసికోవాలంటే బులుసు సాంబమూర్తి గారిని కాని బచ్చు జగన్నాధదాసు గారిని కానీ విచారించుడని విజ్ఞప్తి చేశాడు."

అన్నపూర్ణయ్య 18-4-1942 తేదీన ప్రభుత్వానికి పంపుకొన్న విజ్ఞప్తిలో తాను ఫార్వర్డు బ్లాకు కార్యవర్గ సభ్యునిగా వున్నానని ప్రపంచ యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధంగా తొలుత భావించాననీ ఇప్పుడు మారిన యుద్ధ పరిస్థితులవల్ల (రష్యా ప్రవేశంతో ప్రజాయుద్ధమైనది) ఫార్వర్డు బ్లాకు తన మొదటి వైఖరినే అంటిపెట్టుకున్నందున తాను ఫార్వర్డు బ్లాకు నుండి వైదొలగుతున్నాననే ఫాసిస్టు వ్యతిరేక శక్తులతో పోరాడదలచిన తనను బేషరతుగా విడుదల చేయమని కోరాడు.

ఎన్ని విజ్ఞప్తులు పంపుకున్ననూ అన్నపూర్ణయ్యను 1945 జూన్‌లోనే విడుదల చేశారు.

జైలులో కూడా తమకు అన్యాయమని తోచిన అంశాలపై అన్నపూర్ణయ్య పోరాడుతూనే వుండేవాడు. వేలూరు జైలులో ఆయన సహచరుడుగా వున్న వావిలాల గోపాలకృష్ణయ్య తమ అనుభవం ఇలా తెలిపారు:

1941 ఏప్రిల్‌లో వేలూరు జైలులో ఖైదీలను తరగతులుగా విభజించే విషయమై మేయరుగా నున్న అన్నపూర్ణయ్య అధ్వర్యంలో నూరుమంది ఖైదీలు 19 రోజులు నిరసన దినం సాగించారు. 12 రోజులయ్యే సరికి పిన్నవాడైన వావిలాల నాడి అందక మరణిస్తాడేమోనని అనుమానం వేసింది. అప్పుడు అన్నపూర్ణయ్య ప్రభృతులు ఆయనకు నచ్చచెప్పి దీక్ష విరమింపచేశారు. "మనం ప్రతిఘటించడానికి దీక్ష బూనాం. కాని చావటానికి కాదు" అన్నాడు అన్నపూర్ణయ్య.

## జైలులో జాతక చక్రాలు: సాహితీ వ్యాసంగం

జ్యోతిషశాస్త్రంలో అన్నపూర్ణయ్యకు అపారమైన నమ్మకం. దానిలో విశేష కృషి చేసినట్లు ఆయన జైలులో వేసిన అనేక జాతక చక్రాలే నిదర్శనం.

ముందుగా ఆయన తన జాతకం వేసికొని ఏయే గ్రహాల కాలంలో తనకు శిక్షలు పడిందీ మొదలుగా గల వివరాలు రాసుకున్నాడు. తన భార్య వెంకటరమణమ్మ జాతక వివరాలు 1944 వరకూ రాసి గురుదశలోని అంతర్దశలో 6-12-1943న కాలధర్మం చెందినదని నోట్ రాశాడు. కుమార్తె రాజేశ్వరి కుమారుడు జయరామ్ యొక్క జాతక చక్రాలు గ్రహాల సంచార కాలపరిమితి వివరాలు రాశాడు.

మిత్రులయిన నాళం వెంకట్రాయుడు రంగశాయి, కుమార్తె కౌసల్య, మిత్రుడు వి. వెంకటరామశాస్త్రి, డా॥ అచ్చమాంబ, టి.వి.ఎస్. చలపతిరావు, చేబ్రోలు వెంకటరత్నం, వి.ఎస్. ప్రసాద్ ఆయన భార్య హనుమాయమ్మ, ఆంధ్రనాయకులు డాక్టర్ పట్టాభి జాతక చక్రం వేసి గురుమహర్దశ బుధలో (1949-51) ఉన్నత రాజకీయ స్థితికి అవకాశం అని రాసి వుంచాడు. అది యదార్థమై ఆయనకు కాంగ్రెసు అధ్యక్ష పదవి లభించింది.

ఆంధ్ర ప్రముఖులు అయ్యదేవర కాళేశ్వరరావు, ఆచార్య రంగా, మొసలికంటి తిరుమలరావు, ముళ్లపూడి పళ్లంరాజు, కళా వెంకటరావు, సుందరరాజు అయ్యంగార్,

క్రొవ్విడి లింగరాజు, బులుసు సాంబమూర్తి, మాగంటి బాపినీడు, నీలం సంజీవరెడ్డి, కల్లూరు సుబ్బారావు గార్ల జాతక చక్రాలు కూడా అన్నపూర్ణయ్య జైలు నోట్సులో వున్నాయి.

భారత జాతీయ కాంగ్రెసు జననకాలానికి సంబంధించిన జాతకచక్రంతోపాటు మహాత్మాగాంధీ స్టాలిన్ హిట్లరు జాతక చక్రాలు కూడా ఇందులో చోటు చేసికున్నాయి.

వెలుగు పత్రికలో కూడా తరచూ జాతీయ నాయకుల భవిష్యత్తును గూర్చి జ్యోతిషశాస్త్రవేత్తలు చేసే ప్రకటనలు ప్రముఖంగా ప్రకటించేవాడు అన్నపూర్ణయ్య.

అన్నపూర్ణయ్య స్పందించిన కొన్ని సందర్భాలలో ఆయన లేఖినినుండి ఉత్తమ కవితా ఖండికలు వెలువడ్డాయి.

1942 జనవరి 23న "చిలుక–కాకి సంవాదము" అనే చక్కని గేయం వేలూరు జైలులో రాశాడు. కాకి – స్వేచ్ఛా జీవితాన్ని కోరుకుంటూ చిలుకకు ఇలా సమాధానమిచ్చింది ఈ గీతంలో

*బద్ధపంజర కీరమా! చాలుచాలు*
*పంచభక్ష్య పరమాన్నముల్ వలదునాకు*
*ఎంగిలి మెతుకుల కంగలార్చను నేను*
*రెక్క లాడించి డొక్కనాడించుకొనుటె భువిని*
*గౌరవంబైన మార్గంబు సుమ్ము! నమ్ము.*

అన్నపూర్ణయ్య తన భావాలే కాకినోట పలికించాడు.

సోవియట్ దేశానికి జేజేలు పలుకుతూ 1942 జూన్ 15న రాసిన గేయం కడు రమణీయం. సోషలిస్టు తత్త్వం జీర్ణించుకున్న అన్నపూర్ణయ్య ఏ దేశానికైనా ప్రజల అండకావాలంటూ ఇలా రాశాడు.

*నీ దేశమందుండు*
*నీకండ యై జేరి*
*బలము నీ కిస్తుండ*
*భయములేదంటు నీ వభయమిస్తున్నావు.*

బహుశా మార్క్సిస్టుగా వర్గపోరాటాన్ని గూర్చి ఆలోచిస్తున్న దినాలలో అన్నపూర్ణయ్య –

*కూలివాళ్లము మనము – కూలి వాళ్లము మనము*
*కూడు గుడ్డాలేక కుమిలిపోతున్నాము*
*మేడాలు కట్టాము – మిద్దేలు కట్టాము*
*కూకుంట కైనను – గుడిసె లేదండి.* – కూలివాళ్లము.

యువజన శిబిరాలలో ఈ పాట సామూహికంగా పాడుతూ వుంటే యువకులు పొందే ఉద్రేకానికి అంతు వుండేది కాదు. అన్నపూర్ణయ్యకు సోవియట్ నిర్మాత లెనిన్ అంటే ఎనలేని గౌరవము.

"జోహారులందుకో జోదుమాలెనిన్" గేయంలో లెనిన్‌ను తారాస్థాయికి చేర్చాడు అన్నపూర్ణయ్య.

నాలుగంకాల అసంపూర్తి నాటకాన్ని రచించి దానికేమీ 'పేరుపెట్టలేదు. ఆనందరావు అనే అనాథ విద్యావంతునికి, సరళ అనే బ్రాహ్మణ కన్యకు ప్రేమ వివాహం కథావస్తువుగా సాగిందీ రచన. ఇరువురూ స్వాతంత్ర్య సమరంలో జైలుకు వెళ్లిన వారుగా చిత్రించాడు అన్నపూర్ణయ్య. స్వాతంత్ర్య పోరాటం కథగా చిత్రించిన 'అక్క' నవల లభింపకపోవటం దురదృష్టకరము.

అన్నపూర్ణయ్య అర్ధాంగి అకాల మరణం గూర్చి వ్రాసిన గేయం "వీరపత్ని". అన్నపూర్ణయ్యకు ఆంగ్ల సాహిత్యంతో చక్కని పరిచయమున్నది. ఆంగ్లంలో స్మృతి కావ్యాల (Elegy) కు ఉన్నత స్థానం. Our sweetest songs are those that tell us of the saddest thought (శోకతప్త గీతాలే మధురాతి మధురం) అన్న ఆంగ్లకవి సూక్తికి ఉదాహరణ 'వీరపత్ని'.

కష్టాలపాలైన తన వల్ల భార్యను భర్త ఇలా క్షమాపణ కోరుతాడు.

"పడితి యిన్ని పాట్లు నాదువలన
దొసగులెన్నియొ చేసిన దుష్టమతిని
నేరమెంచక క్షమియించు నెలత నన్ను".

భార్యాభర్త లిరువురు స్వాతంత్ర్య సమరంలో భాగస్వాములు. భార్య ఆత్మకుశాంతి కలగాలంటే దాస్యము పోవాలి. ఈ భావన ఎంత చక్కగా అక్షరబద్ధం చేశాడో చూడండి.

అజ్ఞాత నిష్కామమైన నా త్యాగంబు
సార్థకంబగుగాని వ్యర్థమవదు,
. . . . . . . . . . . . . . .
భరతదాస్యము భస్మమై తోచునిజము
ఆత్మశాంతితో నలరారు వీవనఘచరిత.

అన్నపూర్ణయ్య ఆరాధనకు నోచుకున్న వీరపత్నిని గూర్చి తరువాత అధ్యాయంలో తెలిసికొందాం.

## సహధర్మచారిణి వెంకటరమణమ్మ

అన్నపూర్ణయ్య గారి సతీమణి వెంకటరమణమ్మ 1906 మార్చి 2న పెద్దాపురంలో జన్మించింది. ఈమె కొల్లూరివారి ఆడపడుచు. భర్తకు తగిన ఇల్లాలు అన్నపూర్ణయ్య వెంకటరమణమ్మల వివాహం పెద్దాపురంలో 1919 జూన్ 7న జరిగింది. అప్పుడు

అన్నపూర్ణయ్య వయస్సు 20 సం॥ కాగా వెంకటరమణమ్మకు 14 ఏండ్లు. కట్నకానుకల విషయంలో తేడావచ్చి ఒక దశలో వేరొక సంబంధం చూడాలనుకున్నారు రమణమ్మగారి తండ్రి. కాని రమణమ్మగారు తాను అన్నపూర్ణయ్యనే పెండ్లాడగలనని పట్టుపట్టింది. ప్రేమ వివాహానికి నాంది పలికిన సతిగా 'వీరపత్ని' గేయంలో రమణమ్మగారిని స్తుతించారు అన్నపూర్ణయ్య.

ఉద్యమంలో ప్రవేశించదలచిన అన్నపూర్ణయ్యకు తమ కుటుంబ ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా భవిష్యత్తులో చాలా కష్టాల నెదుర్కొనవలసి వస్తుందనీ (బి.ఏ.) విద్యాభ్యాసం విరమించవద్దనీ ఒక లేఖలో కోరింది. కాని అన్నపూర్ణయ్య ప్రేయసి తొలికోర్కెను మన్నించలేదు. ఆయన సాహచర్యంలో ఆమెలో గొప్ప మార్పు వచ్చింది.

1925 మే లో అన్నపూర్ణయ్య దంపతులు సీతానగరం గౌతమీ సత్యాగ్రహం ఆశ్రమంలో ప్రవేశించారు. 1927 ఫిబ్రవరి 8న వీరికి కలిగిన కుమార్తెకు 'రాజేశ్వరి' అని నామకరణం చేశారు.

1932 జనవరిలో సీతానగరం ఆశ్రమం చట్టవిరుద్ధమని ప్రభుత్వం ప్రకటించింది. ఈ విషయం ముందుగా తెలిసినందున స్త్రీలనందరినీ బైటకు వెళ్లమని కోరారు. కానీ వెంకటరమణమ్మగారు మాత్రం "చావో బ్రతుకో మగవారితో పాటే మేమూ" అంటూ ఆశ్రమం వదలి వెళ్లడానికి నిరాకరించింది. కానీ పెద్దలు ఆమె కోరికను అంగీకరించక స్త్రీలనందరినీ బైటకు పంపివేశారు.

ఆమెకు పతిననుసరించి జైలుకు వెళ్లాలనే కోరిక బలంగా వుంటూ వచ్చింది. రాజమండ్రిలో విదేశీ వస్త్రాల దుకాణాల వద్ద పికెటింగ్ జరిపినందుకు ఆమెకు ఆరునెలల శిక్ష లభించింది.

నాటి సంఘటన గూర్చి 10-9-1947 "జయభారత్" ఇలా రాసింది.

"1932 జనవరి 26 స్వాతంత్ర్యదినం అప్పటికప్పుడే ముస్తాఫాలీ యొక్క ముష్కరలాఠీ యీ పత్రికాసంపాదకుడు (మద్దూరి అన్నపూర్ణయ్య) యితర సీతానగర ఆశ్రమవాసులయొక్క రక్తాన్ని చిందించి చిందులు తొక్కింది. అతి గడ్డురోజులు. రాజమహేంద్రవరం పట్టణంలో స్వాతంత్ర్య దినం జరిపే యోధులే లేకపోయినారా! అనిపించింది. ఈ మహోక్లిష్ట సమయంలో కార్యరంగంలోకి దుమికింది వృద్ధసేవిక శివరాజు వెంకటసుబ్బమ్మ, ఎనిమిది నెలల గర్భిణితో నున్న శ్రీమతి కాశీభట్ల వెంకటరమణమ్మను (డాక్టర్ కె.ఎల్. నరసింహారావు గారి భార్య) అప్పటికే లాఠీ దెబ్బలకు గురియైన మద్దూరి వెంకటరమణమ్మను తీసికొని రాజమహేంద్రవరం నడిబజారులో సత్యాగ్రహ మొనరించి మా పట్టణ పరువు నిలబెట్టిన వీరవనిత.

1932 జనవరి 27న ప్రారంభమైన శిక్షాకాలాన్ని రమణమ్మగారు కన్ననూరు వేలూరు జైలులో గడిపింది. కన్ననూరులో తన సహచర ఖైదీగా వెంకటరమణమ్మ వుండేదని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధురాలు శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మ తెలిపారు.

1934 అక్టోబరులో గాంధీజయంతి సందర్భంగా రాజమండ్రి వీధులలో ఖద్దరు వస్త్రాలు విక్రయించిన బృందంలో శ్రీమతి రమణమ్మగారు వున్నారు.

1935 జులై 7న అన్నపూర్ణయ్య దంపతులు గౌతమీ సత్యాగ్రహాశ్రమం వదలి రాజమండ్రి చేరుకున్నారు. 1937 ఏప్రిల్ 10న వీరికి కలిగిన కుమారునికి తాతగారి పేరిట 'జయరామ్' అని నామకరణం చేశారు.

1935 లో శ్రీమతి రమణమ్మ తీవ్ర అస్వస్థతకు లోనైనది. కాంగ్రెసు స్వర్ణోత్సవాల నిర్వహణ బాధ్యత అన్నపూర్ణయ్య భుజస్కంధాలపై బడింది. తన ఆరోగ్యం గూర్చి విచారించవద్దని దేశసేవకై తరలి వెళ్లమని పతిని కోరిన మహాఇల్లాలు వెంకటరమణమ్మ.

1940 ఏప్రిల్ 6న అన్నపూర్ణయ్యను నిర్బంధించే నాటికి కుమార్తెకు 13 ఏండ్లు. కుమారునికి 3 ఏండ్లు. అన్నపూర్ణయ్యగారి స్థిరాస్తి శూన్యం. 1945 జూన్‌లో జైలు నుండి తిరిగి వచ్చే నాటికి రెండేళ్ల పూర్వమే ఆమె ఈ లోకం విడిచి వెళ్లింది.

1940–43ల మధ్యకాలం ఆమె జీవితంలో మహా గడ్డుకాలం. భర్తను విడిచి దీర్ఘకాలం బిడ్డలను ఎలా పోషించిందో ఊహకందని విషయం. పుట్టింటివారైన కొల్లూరి సోదరులే వీరికి కొండంత అండగా నిలిచారు.

అన్నపూర్ణయ్యగారి ఆప్తమిత్రులు కూడా కొంత ఆదుకున్నారు.

అన్నపూర్ణయ్య ఎక్కువ కాలం ఖైదీగా గడిపింది వేలూరు సెంట్రల్ జైలులో. కుటుంబం వారి నుండి అడపా దడపా క్షేమసమాచారాలు తెలుపుతూ జాబులు వస్తూవుంటే ఖైదీలకు కొంత ఊరట కలిగేది.

అన్నపూర్ణయ్య గారికి రమణమ్మగారి నుండి ఎక్కువగా లేఖలు వచ్చేవికావు. కార్డు కొనటానికి కూడా కాసులేక కటకటపడిన కాలమది. ఆమె ఒక కార్డు రాసి అందులో "ఈ కార్డు తేదీ లేకుండా రాస్తున్నాను. మీరు నా నుండి ఏదినం జాబు రావాలని ఎదురు చూస్తుంటారో ఆ తేదీ దీని మీద వేసికొని చదువుకొని తృప్తి పడవలసిందిగా కోరుచున్నాను" అని ముగించింది. ఆ లేఖను తాను చదువుకొని చెమ్మగిలిగిన కన్నులతో బొంగురు పోయిన గొంతుతో సహచర ఖైదీలకు చదివి విన్పిస్తే వారందరి కండ్లూ అశ్రుపూరితాలయినాయి.

1942లో ఆమె ప్రభుత్వానికి పంపుకొన్న దరఖాస్తులో తన భర్తను బేషరతుగా విడుదల చేయాలని లేదా కుటుంబ సంరక్షణకు డబ్బు మంజూరు చేయాలని కోరింది. ప్రభుత్వం నెలకు రు.15/– మంజూరు చేసింది. తీవ్ర ధరల పెరుగుదల కారణంగా ఆ మొత్తాన్ని పెంచాలని, 15 ఏండ్ల కుమార్తె వివాహానికి కొంత మొత్తం మంజూరు చేయాలని విజ్ఞప్తి చేసింది. దీర్ఘకాలం కుటుంబ యజమాని ఇంటినుండి దూరం కావడం ఎంత దుర్భరమో వివరిస్తూ ఆమె రాసుకొన్న విన్నపం ఎంతటివారికైనా కన్నీరు తెప్పించజాలినది. కానీ కరడుగట్టిన బ్రిటిషు అధికారుల గుండెలు కరగలేదు. ఎట్టకేలకు జీవనభృతి 1942 జూలైన 1 నుండి రు.25/– లకు పెంచారు. సోదరుల అండన వుండటం భద్రంగా భావించి ఆమె తన మకాం ఏలూరుకు మార్చింది.

1942 ఆగస్టులో కుమార్తెకు వివాహం తలపెట్టామని, అందుకుగాను రు.200/– డబ్బు మంజూరు చేయాల్సిందిగాను అలా సాధ్యంకాకపోతే తనను 15 దినాలు

పెరోల్ పై విడుదల చేయమని అన్నపూర్ణయ్య ప్రభుత్వాన్ని కోరాడు. కానీ నిర్దాక్షిణ్యంగా వీరి కోర్కెలు తిరస్కరించింది.

తండ్రి జైలులో నుండగా 1942 ఆగస్టు 28న తల్లి బంధుమిత్రుల తోడ్పాటుతో ఏలూరులో తన ఏకైక కుమార్తె రాజేశ్వరిని తన సోదరుడైన సూర్యనారాయణశాస్త్రికిచ్చి నిరాడంబరంగా వివాహం జరిపించింది రమణమ్మ.

కుమార్తె వివాహానికి రు.512/- లు ఖర్చుకాగా అందులో రు.200/- రుణముగా సేకరించింది రమణమ్మగారు.

1943 డిసెంబరు 6న వెంకటరమణమ్మ తుదిశ్వాస విడిచింది. అప్పుడు అన్నపూర్ణయ్య మధ్యప్రదేశ్‌లోని దమో జైలులో నిర్బంధంలో వున్నాడు. భార్య అంతిమ దినాలలో తన భర్తను చూడాలని కోరుతూ రాసిన లేఖ అందుకున్న అన్నపూర్ణయ్య వెంటనే మద్రాసు ప్రభుత్వానికి దమో జైలు అధికారుల ద్వారా 'పెరోల్' కొరకు దరఖాస్తు చేశాడు. దానిపై ఉత్తర్వులు వచ్చేలోగా ఆమె మరణవార్త తెలిపే టెలిగ్రాం అందింది.

ఈ టెలిగ్రాం కూడా అదే జైలులో వున్న ఆత్మీయ సహచరుడు క్రొవ్విడి లింగరాజు ముందుగా తీసికొన్నాడు. అన్నపూర్ణయ్యగారికి దుర్వార్త ఎలా తెలపాలో అర్థంకాక కన్నీళ్లు పెట్టుకున్నాడు లింగరాజు. అది గమనించిన అన్నపూర్ణయ్య "ఏమిటీ! రమణమ్మ పోయిందా!" అని అడిగాడు. లింగరాజు టెలిగ్రాం ఆయన చేతికిచ్చాడు.

అన్నపూర్ణయ్య టెలిగ్రాం చూచుకొని మహామౌనం వహించి ఒక మూలకు వెళ్లి కూర్చొన్నాడు.

1947 స్వాతంత్ర్య దినోత్సవంనాడు కొవ్వూరులోగల వీరస్మరణ మందిరంలో ఈమె చిత్రపటాన్ని శ్రీమతి చుండూరు వెంకటరత్నమ్మ ఆవిష్కరించి అంజలి ఘటించింది.

## స్వేచ్ఛా ప్రపంచంలో...

1945 జూన్‌లో విడుదలయిన అన్నపూర్ణయ్య వ్యక్తిగత జీవితంలో ఏకాకి అయిపోయినాడు. అప్పటికే భార్య గతించి రెండు సంవత్సరాలైంది. కుమార్తె వివాహమై అత్తవారింటికి వెళ్లింది. ఏకైక కుమారుని విద్యాబుద్ధులు ఏలూరులో మేనమామే చూసుకుంటున్నాడు. రాజమండ్రిలో బావమరది యింట భోజనం చేస్తూ ప్రజాసేవలో నిమగ్నులయినాడు. అప్పటికి ఆయన ఫార్వర్డు బ్లాకుతో సంబంధం వదులుకున్నాడు. కాంగ్రెసు పార్టీతో తన బంధం అలాగే కొనసాగుతున్నది. 1945 ప్రాంతానికి కాంగ్రెసులో గ్రూపులు విస్తరించాయి. అన్నపూర్ణయ్య - గ్రూపు రాజకీయాలకు అతీతుడు. ఇంతలో రాజమండ్రి పట్టణ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలొచ్చాయి. అన్నపూర్ణయ్య గారు నామినేషన్ వేశాడు. డా॥ ఎ.బి. నాగేశ్వరరావు ప్రత్యర్థిగా నిలిచాడు. డాక్టరుగారికి కాంగ్రెసులో బలమైన వర్గం వుంటూ వచ్చింది. ఆయన శిబిరంనుండి ఇరువురు వ్యక్తులు అన్నపూర్ణయ్యను బలపరచడంతో ఆయన

టౌన్ కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. 1948 జనవరి 25 వరకూ ఆ పదవిలో కొనసాగి సోషలిస్టు పార్టీ ప్రత్యేకంగా ఆవిర్భావం కావడంతో – కాంగ్రెసుకు రాజీనామా చేశాడు.

1946 ఎన్నికలలో రాజమండ్రి శాసనసభ స్థానం నుండి చెన్నపురి శాసనసభకు కాంగ్రెసు అభ్యర్థిగా మద్దూరి అన్నపూర్ణయ్య పేరును రాష్ట్రకాంగ్రెసు సంఘం ప్రతిపాదించింది. కాని కొందరు ప్రత్యర్థులు హైకమాండ్ వారితో (పటేల్ ప్రభృతులకు) అన్నపూర్ణయ్య నేతాజీ అనుచరుడని, ఆయనకు టిక్కెట్ ఇవ్వరాదని వాదించారు. ఆయన స్థానంలో క్రొవ్విడి లింగరాజు గారికి పార్టీ టికెట్ లభించింది. చాలమంది కార్యకర్తలు అన్నపూర్ణయ్య గారికి జరిగిన అన్యాయానికి నిరసనగా కాంగ్రెసుకు ప్రచారం చేయమని భీష్మించుకున్నారు. అన్నపూర్ణయ్య వారికి నచ్చజెప్పి లింగరాజు విజయానికి కృషి చేశాడు.

అన్నపూర్ణయ్యకు తొలి ప్రేయసి – పత్రికా రచన. తన భావాలను రాసి ప్రకటించి ప్రజానీకాన్ని జాగృతం చేయాలని ఆయన ఎప్పుడు తపించేవాడు.

## స్వాతంత్ర్యదినం నాడు...

రాజమండ్రిలో భారత స్వాతంత్ర్య దినోత్సవం (1947 ఆగస్టు 15) కడు వైభవంగా జరిగింది. పట్టణంలో సుమారు 60 ప్రదేశాలలో ఉత్సవాలు జరిగాయి.

ముందుగా జెండా పంజారోడ్డులోని పార్కులో అన్నపూర్ణయ్య మహాత్మాగాంధీ విగ్రహాన్ని ఆవిష్కరించాడు. ఆ పార్కుకు ఆనాడే మద్దూరి అన్నపూర్ణయ్య పార్కుగా నామకరణం జరిగింది. (1997లో భాట్టం శ్రీరామమూర్తిగారు అన్నపూర్ణయ్య విగ్రహాన్ని ఆవిష్కరించారు.) లాంచీ రేవులో నేతాజీ విగ్రహాన్ని కూడా అన్నపూర్ణయ్యగారే ఆవిష్కరించాడు. విక్రమహాలులో గాంధీ విగ్రహాన్ని పెనుమత్స సత్యనారాయణరాజు, తిలక్ విగ్రహాన్ని, డా॥ ఎ.బి. నాగేశ్వరరావులు ఆవిష్కరించారు.

గౌతమీ వ్యాయామశాలలో, ప్రభుత్వ బాలికల పాఠశాలలోనూ అన్నపూర్ణయ్య ప్రసంగించారు.

సాయంత్రం 50 వేలమంది గుమిగూడిన జనసందోహంలో అన్నపూర్ణయ్య గంభీరోపన్యాసం చేశాడు.

స్వాతంత్ర్య దినోత్సవం నాడే రాజమండ్రి నుండి "జయభారత్" వారపత్రిక నెలకొలిపాడు అన్నపూర్ణయ్య.

### జయభారత్

"జయభారత్" పత్రిక స్థాపనకు కొంత ఆర్థిక సాయాన్ని తర్వాత అందించిన వాడు శ్రీ పి.వి.జి. రాజు. శ్రీ ఎర్రమల్లి నరసింహారావు, శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గార్లు సహాయ సంపాదకులుగా వుండేవారు.

1947 నవంబరు 1న వెలువడిన "జయభారత్" ఆముఖంలో "సోషలిస్టు వారపత్రిక" అని ప్రకటించబడింది.

సంపాదకీయంతోపాటు అమృతరావు కలంపేరుతో 'కలంచిందులు' శీర్షికన వ్యాఖ్యలు విమర్శలు చేసేవాడు అన్నపూర్ణయ్య. ఒక చిన్న కథ, ఒక కవిత, జనవాక్యం శీర్షికలు కూడా వుండేవి. ఒక్కొక్కసారి ముఖచిత్రంలో దేశభక్తుని ఫోటో వేసి వారిని గూర్చి రాస్తూ వచ్చింది. 1947 ఆగస్టు 27 సంచిక ఆంధ్రకేసరి ప్రకాశం ముఖచిత్రంతో వెలువడింది. వారిని గూర్చి ఇలా రాశారు:

"ఆంధ్రులకు ఏ ఒక్క సమస్య పైనా ఐక్యత లేదు. కాని ప్రకాశం గారిని పూజించుటలో మాత్రం సంపూర్ణ యేకీభావం కలదు. ఆయనలో వున్న విశేషమేమిటి? ధైర్య స్థైర్యములు - త్యాగ సాహసములు ఆయన సొమ్ములు. కాని ఆ సుగుణములు కలవారు ఆంధ్రదేశంలో పలువురు లేకపోలేదు. ఆపద ఎక్కడ వుంటే అక్కడ ప్రత్యక్షం. తుపాను వచ్చి వరదలు పారి ప్రజలు నీడలేక అల్లాడుచున్నారంటే ఆంధ్రకేసరి వాలవలసిందే."

సోషలిస్టు నాయకులు అచ్యుత్ పట్వర్ధన్, రామమనోహర్ లోహియా, కమలాదేవి, అశోక్ మెహతా, పి.వి.జి రాజుగార్లను తన పత్రికలో చక్కని పరిచయం గావించాడు అన్నపూర్ణయ్య.

***అచ్యుత్ పట్వర్ధన్:*** "(17-10-1947 జయభారత్) విఖ్యాత సోషలిస్టు నాయకుడు. భారత సోషలిస్టు పార్టీకి కొంతకాలం ప్రధాన కార్యదర్శి. ప్రస్తుతం సహాయ కార్యదర్శి. కాశీ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ పదవికి రాజీనామానిచ్చి రాజకీయాలలో ప్రవేశించాడు. లక్నో, ఫైజాపూర్ ఎ.ఐ.సి.సి.లో సభ్యుడు. అనంతరం నిరాకరించాడు. 1942 ఆగస్టు విప్లవంలో 3 ఏండ్లు అజ్ఞాత వాసంలో వుండి అరుణాఅసఫాలీ సాయంతో ఆగస్టు విప్లవాన్ని నడిపాడు. మహారాష్ట్రలోని సతారాలో బ్రిటిషు ప్రభుత్వానికి బదులు స్వదేశీ ప్రభుత్వం ఏర్పడిందంటే అది మన అచ్యుత్ యొక్క అకుంఠిత దీక్షా, అనుపమ కార్యదక్షతా ప్రభావమే. ఇతని సోదరుడు రావుసాహెబ్ పట్వర్ధన్ ఇతని కన్నివిధాలా చేదోడు వాదోడుగా నిలిచాడు. మహారాష్ట్రలో పట్వర్ధన్ కుటుంబం ప్రతిభావంతమైనది. ప్రఖ్యాతవంతమైనది కూడాను. అచ్యుత్ అనర్గళ ధాటితో వుపన్యసించగల వక్త."

***రామమనోహర్ లోహియా:*** (8-10-1947 జయభారత్) శ్రీ రామమనోహర్ లోహియా సోషలిస్టులలో పేరెన్నికగన్న వాడు. విజ్ఞానవంతుడు. ఎ.ఐ.సి.సి. విదేశాంగ శాఖ కార్యదర్శిగా పనిచేసి వినుతికెక్కాడు. సోషలిస్టు పార్టీ జాతీయ కార్యవర్గంలో ప్రముఖుడు. 1942 ఆగస్టు విప్లవాన్ని తేజోవంతంగా నడిపిన వీరుడు. ఢిల్లీ ఎర్రకోటలో జయప్రకాశ్‌తో బందీయై అష్టకష్టాలు అనుభవించిన యోధవర్యుడు.

***శ్రీమతి కమలాదేవి:*** (18-2-1948 జయభారత్) అఖిలభారత మహిళా మండలి మాజీ అధ్యక్షురాలైన శ్రీమతి కమలాదేవి ఎన్నదగిన భారతీ రమణీమణులలో

నాయకత. ఉత్తమ శ్రేణికి చెందిన కవయిత్రి. మంచి వక్త. ఈమె మొన్నటివరకు ఎ.ఐ.సి.సి. సభ్యురాలు. అంతేకాదు, ప్రముఖ సోషలిస్టు నాయకురాలున్నూ. సోషలిస్టు కార్యనిర్వాహక వర్గంలో వుంటూ సామ్యవాద భారత దేశంకోసం నిజమైన కృషి చేస్తున్నది. ఈమె కృషికి నీరాజనం.

అశోక్ మెహతా: (27–10–1953 "వెలుగు") అశోక్ మెహతా సోషలిస్టు నిర్మాతలలో ఒకడు. హింద్ మజ్దూర్ సభ నిర్మాత అతడే! మేధావి. వక్త. విద్యాసంపన్నుడు. నిర్మాణ కార్యకర్త. ఇన్ని ప్రతిభా విశేషాలు ఒకే వ్యక్తిలో మూర్తీభవించడం బహు అరుదు. పైగా ప్రజలను నడిపే అతని శక్తి అద్వితీయం. బొంబాయిలో కార్మికులను వర్లీలో కర్షకులను అత్యద్భుతముగా అతను నడుపుచున్నాడు. ప్రజాసోషలిస్టు పార్టీకి ప్రధాన కార్యదర్శి. పార్లమెంటుకు మధ్యప్రదేశ్ నుండి నిలబడుచున్నాడు. అట్టి ప్రతిభాశాలిని సభ్యుడుగా సంపాదించే భాగ్యం పార్లమెంటుకు పడితే పరమ సంతోషం. 1928లో సర్దారు వల్లభాయి పటేలు నడిపిన బార్డోలీ రైతు పోరాటం వంటిదే వర్లీ సత్యాగ్రహం. అఖిల భారత విఖ్యాతిగన్న నాయకులందరిలోను అతడు పిన్న వయస్కుడు. దేశభక్తుడు. కార్మిక సేవకుడు. కర్షక నాయకుడు. బహువిజ్ఞాని. బహుళ గ్రంథ రచయిత. అఖండ నిర్మాణ శక్తి సంపన్నుడు. నిష్కళంక సేవామూర్తి. ఈ శుభ సమయమున (42వ జన్మదినం) మా మిత్రుడైన మెహతాను నిండు ప్రేమతో అభిమానించుచున్నాము.

*విజయనగరం మహారాజా (పి.వి.జి. రాజు):* (7–10–1947 జయభారత్) విజయనగరం మహారాజు ఒక ప్రకటనలో "భూమినంతటినీ జాతీయం చేసే బిల్లును ప్రతిపాదించాలి. ఈ బిల్లుతో పాత పద్ధతులు, ఆచారాలు అన్నీ ఒక్క దెబ్బన తుడుచుకొనిపోయి భూమి అంతా ప్రభుత్వ పరమైపోతుంది. సామ్రాజ్యవాదుల అడుగు జాడలలో ఏర్పడిన ఈ జమీందారీలు ఎంత త్వరగా రద్దయితే అంతమంచిది."

"జయభారత్" సంపాదకుడు అడిగినంతనే శ్రీ జయప్రకాశ్‌కు సోషలిస్టు పార్టీ నిమిత్తం పదివేల రూపాయలనిచ్చిన విజయనగరం మహారాజా గారిట్టి విశాల భావపూరిత ప్రకటన చేయుటలో వింతలేదు. జమీందారులకు మార్గదర్శకులైనందున ప్రభుత్వానికి చక్కని సూచనలిచ్చినందుకు వారిని సంపాదకుడు నిండు హృదయంతో అభినందించుచున్నాడు.

ప్రజానీకంలో చక్కటి ఆదరణ నందుకొన్న జయభారత్ పత్రిక కొద్ది సంవత్సరాలు నడిచి తరువాత ఆగిపోయింది.

## ఆంధ్రలో సోషలిస్టు పార్టీ

1948 మార్చి 21 తేదిన నాసిక్ మహాసభలో సోషలిస్టు పార్టీ కాంగ్రెసుతో తెగతెంపులు చేసికోవాలన్న తీర్మానం ఆమోదించింది. ఈ మహాసభల్లో పార్టీ అధ్యక్షుడుగా ఆచార్య నరేంద్రదేవ్, ప్రధాన కార్యదర్శిగా జయప్రకాశ్ నారాయణ్ ఎన్నుకోబడినారు.

ఆంధ్రలో సోషలిస్టు పార్టీ అడ్‌హాక్ కమిటీ శ్రీ యం. బాలకృష్ణ కార్యదర్శిగా ఏర్పడింది. దానిలో మద్దూరి అన్నపూర్ణయ్య, చక్రధర్ ప్రభృతులు సభ్యులు.

1950 మే 24, 25 తేదీలలో జాతీయ పార్టీ సహాయ కార్యదర్శి శ్రీ ప్రేమ్ భాసిన్ సమక్షంలో రాష్ట్ర కార్యవర్గం ఎన్నిక జరిగింది. మద్దూరి అన్నపూర్ణయ్య కార్యదర్శి, చక్రధర్ సహాయ కార్యదర్శి అయినారు.

1950 లో శ్రీ జయప్రకాశ్ ఆంధ్ర ప్రాంతమంతటా విస్తృతంగా పర్యటించారు. ఆయన వెంట ప్రధాన కార్యదర్శి మద్దూరి అన్నపూర్ణయ్య వుండి జె.పి. ప్రసంగాలను తెలుగులో అనువదించాడు. ఆ బహిరంగ సభలలో పెద్ద ఎత్తున ప్రజలు పాల్గొన్నారు. జె.పి. తన పర్యటనలో వసూలయిన లక్షరూపాయలు ఆంధ్ర రాష్ట్ర పార్టీకి ఇచ్చారు.

## ఎన్నికలలో ఓటమి

1952లో సాధారణ ఎన్నికలు వచ్చాయి. మద్రాసు శాసనసభకు ఆంధ్ర ప్రాంతంనుండి ఆరుగురు శాసనసభ్యులు సోషలిస్టు పార్టీ టికెట్‌పై ఎన్నికైనారు.

సోషలిస్టు పార్టీకి విశాఖపట్నం జిల్లా బలమైన కేంద్రం. విజయనగరం మహారాజు (పి.వి.జి రాజు) అక్కడ పార్టీకి పట్టుకొమ్మ. చిరకాలం కారాగారవాసం చేసి ఎన్నో కష్టాలు అనుభవించిన సీనియర్ నాయకుడు మద్దూరి అన్నపూర్ణయ్యను శాసన సభ్యుడుగా చూడాలని ఆయన పట్టుదల. విశాఖ జిల్లాలో ఏదేని ఒక నియోజక వర్గం నుండి పోటీ చేయమని పి.వి.జి. రాజు అన్నపూర్ణయ్య గారిని కోరాడు. కానీ అన్నపూర్ణయ్య రాజమండ్రి నుండే శాసన సభకు పోటీ చేయగలనని రాజుగారి ఆహ్వానాన్ని మృదువుగా తిరస్కరించాడు.

1952లో రాజకీయ పరిస్థితి చిత్రంగా వుంది. ఆంధ్రకేసరి ప్రకాశంగారు కాంగ్రెసు నుండి బయటకు వచ్చి ప్రజాపార్టీని స్థాపించారు. అంతవరకు నిషేధం వుండి పలువురు నాయకులు అండర్ గ్రౌండులో వున్న కమ్యూనిస్టు పార్టీ ఎన్నికల రంగంలో ప్రవేశించింది. ఈ స్థితిలో రాజమండ్రి శాసన సభ స్థానానికి పోటీ నలుగురి మధ్య జరిగింది. కాంగ్రెసు అభ్యర్థిగా డా॥ కె.ఎల్. నరసింహం పోటీ చేశాడు. ప్రజాపార్టీ క్రొవ్విడి లింగరాజును తమ అభ్యర్థిగా నిలిపింది. సోషలిస్టుల తరఫున మద్దూరి అన్నపూర్ణయ్య. వీరి తరఫున ప్రచారం కోసం ఆంధ్ర యూనివర్సిటీ విద్యార్థులైన సోషలిస్టు యువకులు శ్రీ ఎ.వి.కె. చైతన్య రాజమండ్రిలో వుండి ప్రచారం సాగించారు. పోటీలోవున్న ముగ్గురూ చాలా ప్రముఖులు. త్యాగ చరిత్రకలవారు. అయినప్పటికీ 30 సంవత్సరాల యువకుడు కమ్యూనిస్టు అభ్యర్థి చిట్టూరు ప్రభాకర చౌదరిని విజయలక్ష్మి వరించింది. ఆయన అప్పుడే జైలునుండి రావడం కమ్యూనిస్టులు రాజమండ్రిని కేంద్రంగా చేసికొని పార్టీ జిల్లా కార్యాలయం కూడా నెలకొల్పి శ్రమజీవులలో పట్టు సంపాదించడం – మొదలుగాగల కారణాలు కమ్యూనిస్టు అభ్యర్థి విజయానికి తోడ్పడినవి.

ఈ ఎన్నికల గూర్చి తులసి గంగాధర రామారావు ఇలా రాశారు. "ఎలక్షన్లకు రెండు రోజులముందు అన్నపూర్ణయ్య స్వయంగా మైకులుకట్టిన కారులో బయలుదేరి పుర వీధులలో ప్రసంగించారు. ఆ ఉపన్యాసంలో నేను 1920 సంవత్సరంలో ఇంకా కొద్ది రోజుల్లో బి.ఏ., పరీక్షలు వుండగా చదువుకు స్వస్తి చెప్పి దేశ స్వాతంత్ర్య సంగ్రామంలో కాలుపెట్టాను. నాకు ఆస్తిపాస్తులు ఏమియు లేవు. నా వయస్సు 21 సం॥ తదాది 1945 మధ్యకాలంలో 14 సం॥ జైలు శిక్ష అనుభవించాను. నా భార్య వెంకట రమణమ్మ నేను జైలులో వుండగనే మరణించింది. ఆ సమయంలో కట్టుకొన్న ఇల్లాలిని చూడటానికి బ్రిటిష్ ప్రభుత్వం పెరోలు కూడా ఇవ్వలేదు. కన్న కూతురి పెళ్లి కూడా చూడలేకపోయాను. నేను మిమ్ము ఒక ఓటు మాత్రమే కోరుచున్నాను. నేను గెలిచినా ఓడినా ఆఖరి శ్వాసవరకు రాజమండ్రి గోదావరి తీరాన్నే వుంటూ దేశ సేవ చేస్తాను" అన్నిచోట్ల ఆయన ఉపన్యాసం విన్న ప్రజలందరూ కన్నీళ్లు పెట్టుకొన్నారు.

ఒకవైపు ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగుతుండగా జరిగిన సంఘటన శ్రీ సి.వి. రాజగోపాలరావు ఇలా తెలిపారు "ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగుతున్నది. రంగంలో ఉన్నవారంతా మిత్రులే! ఒకరంటే ఒకరికి ఎంతో గౌరవం. కాని ప్రత్యర్థులు ఒక రోజురాత్రి ఎన్నికల సభ జరిపి కాంగ్రెసును దుయ్యబడుతూ ఉపన్యాసాలు చేసిన అన్నపూర్ణయ్య రాత్రి 12 గంటలకు డా॥ నరసింహారావు (కాంగ్రెసు అభ్యర్థి) ఇంటి తలుపు తట్టాడు. తలుపుతీసిన వారి అబ్బాయి అన్నపూర్ణయ్యను చూసి ఆశ్చర్యపోయాడు. మీనాన్న ఉన్నాడా అని లోపలికి వెళుతూ" రమణమ్మా అన్నం వడ్డించమ్మా అనికేక పెట్టాడు. భోజనం తర్వాత ప్రత్యర్థులు ఇద్దరూ ఒక గంటసేపు కులాసాగా కబుర్లు చెప్పుకున్నారు. అన్నపూర్ణయ్య గారిని రిక్షా ఎక్కించి సాగనంపారు రావుగారు."

ఎన్నికలలో ఓడిపోయినట్లు తెలిసినా అన్నపూర్ణయ్య ముఖంలో రవంత కూడా విచారం కన్పించలేదు. శిష్యుడు తులసి గంగాధర రామారావు విచారానికి మేరలేదు. అతనిని ఓదారుస్తూ అన్నపూర్ణయ్య ఇలా అన్నాడు "గెలుపు ఓటములు ప్రధానం కావు. ఇంటినుండి బయటికి వెడితే ఇంటికి వస్తామన్న నమ్మకంలేదు స్వాతంత్ర్యం మా గురించి కాదు. భావితరాల విముక్తి కోసం పనిచేశాం. త్యాగం చేశాం. నా కన్న చిన్నవాళ్లు భగత్‌సింగ్, చంద్రశేఖర్‌లు దేశం గురించి ప్రాణాలు అర్పించారు. అలాగే వినాయక్ సావర్కారు ఎన్నో త్యాగాలు చేశాడు. కాంగ్రెసుకు రాజీనామా చేసిన తరువాత ఆచార్య నరేంద్రదేవ్ మొదలగు నాయకులందరు బైఎలక్షన్‌లలో ఓడి పోలేదా! ఇక భవిష్యత్తు అంతా మనదే" అంటూ ఊరడించాడు అన్నపూర్ణయ్య.

## యువశక్తిపై అన్నపూర్ణయ్య విశ్వాసం

స్వాతంత్ర్య ఉద్యమంలో తమ త్యాగాలన్నీ భావితరాల వారికొరకేనని అన్నపూర్ణయ్య పలుమార్లు నొక్కి వక్కాణించాడు. 1929 జనవరిలో కాకినాడ బ్రదర్‌హుడ్ లీగ్ ప్రథమ వార్షికసభలో ఆయన ఇలా ప్రసంగించాడు.

"ప్రపంచ దేశాలన్నిటిలో యువకులే తమ దేశాలలో జీవితాలు, సంపద బలిదానం గావించడంలో ముందు నిలిచారు. భారత దేశచరిత్ర చదవండి. మీ స్కూళ్లలో పాఠ్యగ్రంథాలు చెప్పేవి కట్టుకథలు. నిజమైన చరిత్ర చదవండి. 40 ఏండ్ల కాంగ్రెసు చరిత్ర చదివితే గొప్ప దేశభక్తులు ఎందరో తమ సర్వస్వాన్ని దేశ స్వాతంత్ర్యంకోసం అర్పించిన విషయం మనం గ్రహించగలం. కాని ఎందరు వీరులు అజ్ఞాతంగా బలి అయినారో అండమాన్ జైళ్లలో ఎందరు కుందుచున్నారో విదేశాలలో మరెందరు బాధలకు గురి అవుతున్నారో మీకు తెలుసా!

1857 సమరాన్ని మననం చేసికొండి. 23 సంవత్సరాల లక్ష్మీబాయి అయిదేళ్ల తన పసిబిడ్డను గుర్రం జీనుకు కట్టుకొని ఒక్క ఉదుటన 60 మైళ్లు గుర్రం మీద పయనించి ఆంగ్ల సోల్జర్లను – ముఖ్యంగా తనకు మార్గమధ్యంలో తారసపడిన జనరల్ జేసర్‌ను ఓడించింది గదా! అంతదూరం ఎందుకు? 25 ఏండ్ల యువకుడు అల్లూరి సీతారామరాజు – ఇటీవల కైజరును ఓడించిన – బ్రిటిషు ప్రభుత్వాన్ని ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించినాడు కాడా! గుర్తుంచుకోండి – అతడు మన కాకినాడ కళాశాల విద్యార్థియే! కాబట్టి యువకుడే దేశానికి జీవం యువకుల్లారా ఈ రహస్యం మరువకండి."

సమాజ పునర్నిర్మాణంలో విద్యార్థులు వహించిన పాత్రని అన్నపూర్ణయ్య 1954 మార్చి 30 తేదీగల 'వెలుగు' సంపాదకీయంలో ఇలా తెలిపాడు.

"తెలుగు విద్యార్థి ఆసరా చూచుకునే వీరేశలింగం వితంతు వివాహాలు జయప్రదంగా జరిపించాడు. రాళ్ళు రువ్విన ఛాందసుల నుండి ఆమహనీయుని రక్షించింది తెలుగు విద్యార్థే! తెలుగు విద్యార్థి ముందంజ వేస్తేనే వర్ణాంతర వివాహాలను జరిపించి కులతత్వ పిశాచాన్ని ఎదుర్కొన్నాడు."

తెలుగు విద్యార్థిని నమ్ముకునే అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మార్పణముచేసి ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించాడు.

రైలు నాపింది; బాష్ప వాయువు నెదిరించింది, గుండుకాహుతి యైనది, ప్రభుత్వాన్ని స్తంభింప జేసింది తెలుగు విద్యార్థియే! ఇన్ని చేసి ఆంధ్రరాష్ట్రాన్ని తెచ్చి పెట్టింది అతడే!

గతవరదలలో సర్వస్వము గోల్పోయి నిలువనీడలేక అల్లాడిపోయిన దీనజనులను సేవచేసినదీ తెలుగు విద్యార్థియే!

అన్ని విధాల వాని కగ్రజుడు తెలుగు యువకుడు. తనలోపాలను సవరించుకొని తన దురాభ్యాసాలను తొలగించుకొని తనలో దురాచారాలను తుదముట్టించుకొని పునీతులై పరిశుద్ధులై మేలిమి బంగారము వలె దేదీప్యమాన శోభతో తెలుగు విద్యార్థి యువకుడు ముందుకు రావాలి."

## ఆంధ్రోద్యమంలో...

ఆంధ్రరాష్ట్రసాధనే లక్ష్యంగా కల 'ఆంధ్రమహాసభతో 1925 నుండి అన్నపూర్ణయ్యకు సన్నిహిత సంబంధాలుండేవి.'

ఆంధ్రరాష్ట్రోద్యమం అనేక మలుపులు తిరిగి ఎప్పటికప్పుడు రాష్ట్రం వచ్చినట్లే కన్పించి కనుమరుగవుతూ వచ్చింది.

1946లో మీరట్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో ఆంధ్రరాష్ట్ర సమస్య చర్చకు వస్తే నూతన రాజ్యాంగంతో పాటు రాష్ట్రం కూడా సాధ్యమవుతుందని భావించారు. ఆంధ్రకాంగ్రెసు సంఘానికి చెందిన కళా వెంకట్రావు ప్రభృతులు రిక్విజిషన్ ద్వారా సమస్య చర్చకు తేవాలని నిశ్చయించారు. కాని వారికి 16 మంది కంటె ఎక్కువ సంతకందార్లు లభించలేదు. ఈ స్థితిలో అన్నపూర్ణయ్య తాను పూనుకొని సోషలిస్టు నేతలు జయప్రకాశ్, లోహియా ప్రభృతులందరిచేత సంతకాలు చేయించి నిర్ణీత సంఖ్యాబలం సాధించాడు. అయితేనేమి? మీరట్ కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్య కృపలానీ ఆంధ్రోద్యమం జాతీయోద్యమానికి వ్యతిరేకం అంటూ రాష్ట్ర సమస్య చర్చకు అవకాశం కల్పించలేదు. చిట్ట చివరకు 1952 డిసెంబరు 15న పొట్టి శ్రీరాములు ఆత్మాహుతితో ఆంధ్రదేశంలో పెల్లుబికిన అలజడికి తల ఒగ్గి కేంద్ర ప్రభుత్వం 1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేసింది.

ఆంధ్రప్రజాసోషలిస్టు పార్టీ మద్రాసు ప్రత్యేక రాష్ట్రం ఏర్పరచాలనే పొట్టి శ్రీరాములు ఆశయాన్ని సమర్థించింది. అలాగే శ్రీభాగ్ ఒడంబడిక ననుసరించి కర్నూలు రాజధానిగా ప్రకాశంగారి నిర్ణయం సబబైనదని భావించింది. కమ్యూనిష్టులు మరికొందరు రాజధాని కర్నూలు నుండి విజయవాడ తరలించాలని చేపట్టిన ఆందోళనకు స్పందిస్తూ అన్నపూర్ణయ్య చారిత్రక సత్యాలను వెలికి తెచ్చాడు. 1937 నవంబరు 17న ఏర్పడిన శ్రీభాగు ఒప్పందం తరువాత ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు ఆమోదం పొందిందనీ, అప్పట్లో కమ్యూనిస్టు నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య కాంగ్రెసులోనే ఉన్నాడనీ అందుచేత కమ్యూనిస్టులకు ఈ సమస్య తిరుగ తోడే నైతిక హక్కు లేదనీ వాదించాడు.

కర్నూలు రాజధాని తాత్కాలికమైనదని నిజాం సంస్థానం విచ్ఛిత్తి జరగాలని, అందలి తెలంగాణా జిల్లాలతో కలిపి హైదరాబాద్ రాజధానిగా విశాలాంధ్ర నిర్మాణం జరగాలని, అందులకు కృషి జరగాలని అన్నపూర్ణయ్య ప్రచారం చేశాడు.

తెలంగాణాలోని ఒక వర్గం ప్రత్యేక తెలంగాణా నినాదం లేవనెత్తగా అన్నపూర్ణయ్య 'వెలుగు' (15654) సంపాదకీయంలో ఇలా రాశాడు.

"ఏనాటినుండో విశాలాంధ్ర అని కలలు కంటున్న తెలుగు జాతి ఇక మేల్కొని ఆ కల నిజమయ్యే టట్లు చేసికోవలసిన తరుణం ఆసన్నమయింది. ఒకే భాషకు చెందిన ప్రజలు రెండు ప్రత్యేక రాష్ట్రాలు కోరడం ఎంత అవివేకమో ఈ రోజు మనం చెప్పనవసరం లేదు."

కోటి మంది మాత్రమే జనాభా గల తెలంగాణా ప్రత్యేక రాష్ట్రం కోరడంలో గల అర్థమేమిటి? వెనుకబడ్డ చిత్తభ్రమ ఒకటి ఈ రోజులలో ఆంధ్రులలో మరీ వెర్రితలలెత్తడం వింత. కోస్తాఆంధ్రులు, రాయలసీమాంధ్రులు తెలంగాణా ఆంధ్రులు అని పోపుల పెట్టెలో అరలమాదిరిగా ఆంధ్రజాతి ఛిన్నాభిన్నమై అనైక్యతకు లోను కావడాన్ని ఏ తెలుగువాడూ సహించడు సహించరాదు.

ముక్కోటి ఆంధ్రుల ఏకైక లక్ష్యమైన విశాలాంధ్ర నిర్మాణం పూర్తి అయ్యేవరకు తెలుగు జాతి విశ్రమించరాదు. ఆంధ్రరాష్ట్రం వలెనె, విశాలాంధ్ర రాష్ట్రం సాధించి తీరుతాం. జై విశాలాంధ్ర." ఇదియే అన్నపూర్ణయ్యగారు విశాలాంధ్ర గూర్చిరాసిన చివరి సంపాదకీయంగా కన్పిస్తుంది. విశాలాంధ్ర ఆవిర్భావం ఆయన కండ్లార చూడకమునుపే ఆయన 1954 సెప్టెంబరులో కన్నుమూశాడు.

ఆంధ్రోద్యమం చివర ఘట్టమైన పొట్టి శ్రీరాములు ఆత్మాహుతితో వెల్లువలై పారిన ప్రజాందోళనలో విద్యార్థులు ముఖ్యంగా డెమోక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ వహించిన పాత్ర శ్లాఘనీయమని అన్నపూర్ణయ్య ప్రశంసించాడు.

1952 డిసెంబరు 17న రాజమండ్రిలో వేలాది మంది యువకులు కట్టలు తెంచుకొన్న ఉద్రేకంతో గోదావరి రైలుస్టేషన్‌ను చుట్టుముట్టగా వారి ఆవేశాన్ని అదుపులో పెట్టడానికి అన్నపూర్ణయ్య రైలు ఇంజనుపై నిలబడి చేసిన ప్రసంగం గొప్ప ప్రళయాన్ని నివారించింది.

## చరమాంకం...

సోషలిస్టుపార్టీ ప్రత్యేకంగా ఏర్పడినపుడు (1948) అన్నపూర్ణయ్య ప్రధాన కార్యదర్శిగా పార్టీ విస్తరణకు నిర్విరామంగా కృషిచేశాడు. 1952 పూర్వార్థంలో సోషలిస్టు ప్రజాపార్టీలు విలీనమై ప్రజాసోషలిస్టుపార్టీగా ఏర్పాటైన సందర్భంగా బొంబాయిలో సోషలిస్టు జనరల్ కౌన్సిల్‌కు అన్నపూర్ణయ్య హాజరైనాడు. ఆయన హృదయాంతరాళంలో రెండు పార్టీల విలీనం వాంఛనీయం కాదని తోచింది. ఏమైతేనేమి! ప్రజాసోషలిస్టుపార్టీ ఆంధ్ర విభాగం కార్యవర్గంలో ఆయనకు సముచితస్థానం ఇచ్చి యుండలేదు.

ఆయన మానసిక పరిణామం కూడా క్రియాశీల రాజకీయాలపట్ల ఆసక్తి సన్నగిల్లినట్లు ద్యోతకమైంది.

ఆధ్యాత్మికత వైపు దృష్టి మళ్ళిన అన్నపూర్ణయ్యను అవతార్ మెహర్‌బాబా ఆకర్షించాడు. 1953 జులై 10న 'వెలుగు' వారపత్రిక ప్రారంభించాడు. తన తొలిసంచికలో 'వెలుగు' తన ధ్యేయాన్ని ఇలా తెలిపింది.

"పత్రికలలో నేడు అనృతము అతిశయోక్తి మితిమీరి పోయినవి. ఆర్భాటం చేయడం అలజడి కలిగించడం అనే రెండు అవలక్షణాలు పత్రికలను ఆవహించాయి. ప్రేమ, సత్యం మచ్చునకైన కాన రావడం లేదు. దేశరాజకీయములనుండి అవి పూర్తిగా తప్పుకున్నాయి. సామాజిక జీవితం యొక్క అన్ని రంగాలలోను అవినీతి తాండవిస్తున్నది. 'స్వతంత్ర భారత బానిసలారా లేవండోయ్' అని ప్రజానీకాన్ని పురికొల్పే అవసరం కల్గుతున్నది.

ప్రజలకు భుక్తి కావాలి. ముక్తి కావాలి. రెండింటికి తరుణోపాయం చూపిస్తుంది 'వెలుగు'. ప్రజాస్వామిక సోషలిజం స్థాపన ద్వారా భుక్తిని స్థాపిస్తుంది. నీలో నున్న వెలుగును చూచుకొమ్మని నిన్ను మేలుకొల్పడం ద్వారా ముక్తిని సాధిస్తుంది. వెలుగు ఆంధ్రప్రజల హృదయాలలో మహోజ్జ్వల జ్యోతియై వెలుగుతుందని ఆశిస్తున్నాం."

శ్రీ జయప్రకాశ్ నారాయణ్, ఆంధ్రకేసరి ప్రకాశం – వెలుగును ఆశీర్వదిస్తూ సందేశాలు పంపారు.

అన్నపూర్ణయ్య – ప్రజాసేవలో 33 ఏండ్లు పూర్తి అయిన పిమ్మట 1953 డిసెంబరు 2 నుండి తాను ఏ పార్టీకి చెందని ప్రజాసేవకునిగా మిగిలాడు.

'వెలుగు'లో మెహర్ బాబా జీవిత సందేశాలకు ప్రాధాన్యమిచ్చినప్పటికీ అన్నపూర్ణయ్య కలం చిందులు మానలేదు. ఆయన రాజకీయ వ్యాఖ్యలు గిలిగింతలు పెట్టజాలినవి.

ఆంధ్రదేశంలో మెహర్‌బాబా ఖ్యాతి నలుగెడలా వ్యాప్తికావడానికి అన్నపూర్ణయ్య విశేష కృషి చేశాడు.

1954 ఫిబ్రవరి 20 తేది నుండి 11 రోజులు మెహర్ బాబా ఆంధ్రదేశం సంచారం చేశారు. విజయవాడలో స్వాగతం మొదలు మార్చి 4న కాకినాడలో వీడ్కోలు వరకు అన్నపూర్ణయ్య నీడవలె వారిని వెన్నంటి సంచరించాడు. బాబా షష్టిపూర్తి అదే కాలంలో జరిగింది. 'వెలుగు' ప్రత్యేక సంచికను వెలువరించింది. మద్దూరి అన్నపూర్ణయ్య అప్పటికప్పుడు ఆంగ్లంలో కవితలల్లి, మెహర్‌బాబాకు సమర్పించాడు.

ఏలూరులో మెహర్‌బాబా అన్నపూర్ణయ్య అల్లుని ఇంట కుటుంబం వారందరినీ ఆశీర్వదించడమే గాకుండా అన్నపూర్ణయ్యకు అయిదు నిమిషాలు ప్రత్యేక ఏకాంత దర్శనమిచ్చారు. ఆంధ్రదేశంలో మరెవ్వరికీ ఇలాటి అవకాశం కలుగలేదు.

ప్రజాసేవకులు కళా వెంకట్రావు, పాలకోడేటి సూర్యప్రకాశరావు, మద్దూరి బుచ్చి వెంకయ్య, మద్దూరి కృష్ణమూర్తి, నరసింహదేవర సత్యనారాయణలను బాబా ఆశీర్వదించారు.

అన్నపూర్ణయ్యగారి ప్రత్యేక ఏర్పాటు ననుసరించి బులుసు సాంబమూర్తి బాబా సన్నిధికి రాగా బాబా ఆయనను ఆలింగనమొనర్చుకొని ప్రత్యేక ఆసనంపై కూర్చుండజేశారు.

1954 మేనెలలో వేసవితాకిడికి అన్నపూర్ణయ్య ఆరోగ్యం దెబ్బతిన్నది. అయిదు సార్లు వడదెబ్బ తగిలినది. భార్యమరణానంతరం ఏకైక కుమారుడు మేనమామ పరామరికలో ఏలూరులో విద్యాభ్యాసం చేస్తున్నాడు. తాను ఒక్కడే రాజమండ్రిలో వుంటూ చాలాకాలం బావమరిది డాక్టర్ కొల్లూరి కృష్ణశాస్త్రిగారి యింటనే భోజనం చేస్తూ కాలం గడపసాగాడు. ఒక హోటల్ యజమాని వీరికి ఉచితంగా భోజనం అందజేసేవారు. సెప్టెంబరు నెలలో ఏలూరు చేరాడు. అక్కడనే సెరిబ్రాల్ మలేరియాతో 1954 సెప్టెంబరు 11న అంతిమ శ్వాస విడిచాడు. ఆంధ్రదేశం ఒక మహానాయకుణ్ణి కోల్పోయింది. సోషలిస్టులు తమ యోధుణ్ణి పోగొట్టుకున్నారు. శ్రమ జీవుల ఆశాజ్యోతి ఆరిపోయింది.

మూడు దశాబ్దాలు తెలుగు జాతిని ఉర్రూతలూగించిన గళం మూగవోయింది. కత్తిగా వాడబడిన కలం విరిగి వ్రయ్యలయింది.

అన్నపూర్ణయ్య మరణవార్త మెహర్ బాబాకు టెలిగ్రాం ద్వారా తెలుపబడింది. ఆయన తనలో లీనమయినట్లుగా బాబా సందేశం పంపారు.

అన్నపూర్ణయ్య మరణవార్త తెలియగనే పలువురు రాజమండ్రినుండి హుటాహుటిన ఏలూరు చేరారు అత్యంత ఆప్తులయిన శిష్యులు పోతాబత్తుని వెంకట్రావు, తులసి గంగాధరరామారావులు తమ ప్రియతమ నాయకుని భౌతిక కాయాన్ని రాజమండ్రి తీసికొని వెళ్ళాలని తలచారు. కాని సాధ్యపడలేదు. తులసి గంగాధర రామారావు సోషలిస్టు పతాకాన్ని భౌతిక కాయానికి ముందు నిలిపాడు. మరుసటిదినం ఏలూరినుండి అన్నపూర్ణయ్య అస్తికలను మృణ్మయ పాత్రలో కొనివచ్చి రాజమండ్రిలో పురవీధులలో ఊరేగింపుతీశారు. పౌరులందరూ ముఖ్యంగా శ్రామిక వర్గం భోరుభోరున విలపించింది. అన్నపూర్ణయ్య సహచరులు డా॥ ఎ.బి నాగేశ్వరరావు, క్రొవ్విడి లింగరాజు ప్రభృతులు సంతాపసభలో ఘనంగా నివాళులర్పించారు. ప్రఖ్యాత జర్నలిస్టు నార్లవెంకటేశ్వరరావు 1954 సెప్టెంబరు 14న ఆంధ్రప్రభలో వీరిమృతికి సంతాపం ప్రకటిస్తూ సంపాదకీయం రాస్తూ "మహాత్ముని శంఖారావమునకు ఒడలు పులకరించి స్వాతంత్ర్య సమరాంగణములో ఉరికిన ఆంధ్రయువకులలో యోధునిగా పేర్కొనదగినవారు అన్నపూర్ణయ్య, తొలుత కాంగ్రెసు పత్రిక పిమ్మట కొంతకాలం నవశక్తి సంపాదకులుగ పనిచేసి నిర్భయమైన స్వతంత్రరచనలకు తెలుగు పత్రికా రచయితలలో పేరుగాంచారు." అని శ్లాఘించారు.

## సమకాలీనుల స్మృతిపథంలో అన్నపూర్ణయ్య

అన్నపూర్ణయ్య జీవితంలో తారసపడిన సమాజంలోని వివిధ వర్గాల వారి అభిప్రాయాలు పరిశీలిస్తే ప్రజలపై ఆయన వేసిన గాఢమైన ముద్ర తెలుస్తుంది.

### 1. ఆచార్య మధుదండావతే (సోషలిస్టునేత):

స్వాతంత్ర్యోద్యమం కాలంలో తమ జీవితాలను త్యాగం చేసిన అనేకమంది మహనీయులలో ఒకరు. జాతిపిత గాంధీజీ, అన్నపూర్ణయ్య వంటి త్యాగధనులస్ఫూర్తితో పేదవారి సేవచేయడానికి రాజకీయనాయకులు, యువతముందుకు రావాలి. పతనం అవుతున్న విలువలు పునరుద్ధరణకు మద్దూరి జీవితం స్ఫూర్తి దాయకం కాగలదు.

### 2. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (స్వాతంత్ర్య సమర యోధులు):

కాంగ్రెసు వారపత్రిక ప్రారంభదినాలనుండి అన్నపూర్ణయ్యతో పరిచయం. వేలూరి జైలులో మా మేయరు. ఆయన సాహచర్యంలో మేము ఎంతో నేర్చుకున్నాం. ముఖ్యంగా యువకులను ఆకర్షించటంలో ఆయనకు సములెవ్వరూలేరు.

### 3. సర్దార్ గౌతు లచ్చన్న (స్వాతంత్ర్య సమరయోధులు):

తాను నమ్మిన సిద్ధాంతాలకోసం నిర్భయంగా ఉద్యమాలు చేసినవ్యక్తి మద్దూరి. అలాంటి వ్యక్తి స్ఫూర్తి, నేడు దేశానికి అవసరం వుంది. తానునమ్మిన న్యాయానికి నిలబడే శక్తి సామాన్య ప్రజలలో మద్దూరి తన రచనల ద్వారా కల్గించాడు.

### 4. శ్రీ నండూరి ప్రసాదరావు (CPM నేత):

1936లో ఆయన కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి. నేను తూర్పుగోదావరిజిల్లాలో కమ్యూనిస్టు పార్టీనిర్మించేందుకు పంపబడినాను. అన్నపూర్ణయ్యకు సాయపడటం నేను నిర్వర్తించ వలసిన కర్తవ్యాలలో ఒకటి. ఆయన సహజంగా ఆవేశపరుడు. కాంగ్రెసులో హేతువాది. ప్రారంభంలో శ్రద్ధానంద ఘాట్‌లో మీటింగ్ పెట్టేవాళ్ళం. అన్నపూర్ణయ్య అధ్యక్షులు. నేను ఉపన్యాసకుణ్ణి. గాంధీయిజాన్ని విమర్శించటంతో మా ఉపన్యాసాలు వుండేవి. యువకులం కాబట్టి మేం చెప్పేది కొత్త విషయాలు కాబట్టి సభికులు శ్రద్ధగా వినేవారు. అన్నపూర్ణయ్య నిస్వార్థసేవకుడు. తనకూతురు స్కూలు ఫీజు చెల్లించటానికి ఇబ్బంది పడేవాడు.

### 5. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు (ప్రముఖ పాత్రికేయులు):

1947 నవంబరు 2న రాజమండ్రిలో దంతలూరి గోపీచంద్ స్థాపించిన 'కిసాన్' పత్రిక ప్రారంభోత్సవం చేస్తూ "అన్నపూర్ణయ్యగారు నాకు గురువు నా తొలివ్యాసాన్ని 'కాంగ్రెసు' పత్రికలో ప్రచురించి నన్ను ప్రోత్సహించిన మహనీయుడు."

### 6. శ్రీ తులసి గంగాధరరామారావు (సోషలిస్టు కార్యకర్త):

రాజమండ్రి క్వారీవర్కర్సు గొప్ప సభ ఏర్పాటు చేసి అన్నపూర్ణయ్యను ఆహ్వానించారు. చాలసేపు ఆయనకోసం నిరీక్షించారు. కానీ ఆయన రాలేదు. నేను ఆయనను కలసి అడగగా కొంచెంసేపు మౌనం వహించారు. "నేను రావడానికి వాహనానికి డబ్బులు లేనందున అక్కడికి రాలేక పోయినానని చెప్పారు. మీ వద్ద వున్న డబ్బు ఏమైనదని అడుగగా భూపతి కోటేశ్వరరావుకు కొంత డబ్బు యిచ్చినాను, ప్రెస్‌కి కొంత – యిలాగే ఎవరెవరో వచ్చి అడుగగా యిచ్చి భోజనం లేకుండా వుండిపోయినాను." ఇదే విధంగా చాలాసార్లు జరిగింది ఆయన జీవితంలో.

### 7. శ్రీ పోతాబత్తుని వెంకట్రావు (సోషలిస్టు కార్యకర్త):

ఒకసారి రాజమండ్రి పేదలు నివసించే ప్రాంతంలో చచ్చిన జంతువు మాంసం అరగించిన కూలిజనానికి కలరా తగిలింది. రెండు రోజులలో తీవ్రంగా ప్రబలింది. అన్నపూర్ణయ్య నడుంబిగించారు. ఆయన వెంటనడిచాము. తమ ఆరోగ్యం మా బృందం లెక్క సేయక అహోరాత్రులు బాధితులను ఆదుకున్నాం. అందుకే నాకు ఆయన ఆరాధ్యదైవం.

### 8. శ్రీ ఎ.వి.కె. చైతన్య (ట్రేడ్ యూనియన్ నేత, 1952లో యువసోషలిస్టు):

అన్నపూర్ణయ్య గారికి 1952 ఎన్నికలలో ప్రచారం నిమిత్తం కొందరు విద్యార్థులం వాల్తేరు నుండి రాజమండ్రి వచ్చాము. ఒకనాడు ఉదయం టిఫిను వేళకు నేను ఆయన చెంతనే వున్నాను. డజను దాకా ఇడ్లీలు తిన్నట్లు జ్ఞాపకం. నేను వింతగా భావిస్తున్నాననేమో అని తలచి "ఇలా తినటం నా కోసం కాదయ్యా దేశసేవ

కొరకు. పుష్టిగా భోం చేస్తేనే కదా దేశసేవ చేయకలిగేది." అన్నారు. వీరి భోజన పరాక్రమం గూర్చి మాలతీ చందూర్ సైతం తమ అనుభవాన్ని ఆంధ్రప్రభలో రాశారు.

ఎన్నికలలో ఘోరంగా ఓడిపోయిన అన్నపూర్ణయ్యను సమీపించాను. ఆయన ప్రతిస్పందన కనుగొందామని "చూడు చైతన్యా! నాకు నమస్కారం పెట్టిన ప్రతివారు ఓటు వేసివుంటే తప్పక గెల్చి వుండేవాణ్ని. ఏం చేస్తాం. నమస్కారమేమో నాకు – ఓటు ఎదిరి వారికి" అని ముగించారు.

### 9. శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా (ఆం.ప్ర. రాష్ట్రసమాచార శాఖ మాజీ డైరెక్టరు):

అన్నపూర్ణయ్య గారూ మానాన్న అన్నే అంజయ్యగారు నేతాజీ అనుచరులు. జైలులో కూడా సహచరులు. ఆయన వక్త, రచయిత, ఉద్యమ నిర్మాత. ఈ మూడు లక్షణాలు ఒకరిలో వుండడం అరుదు. నేతాజీ, జె.పి.లకు శిష్యత్వం చేసేటప్పుడు వినమ్రత పాటించే అన్నపూర్ణయ్య; తన శిష్యగణంతో స్నేహపూర్వకంగా మెలగడం అన్నపూర్ణయ్యగారి ఔదార్యానికి నిదర్శనం. అదే ఆయన విశిష్టత.

### 10. శ్రీ భాట్టం శ్రీరామమూర్తి (మాజీమంత్రి):

శ్రీఅన్నపూర్ణయ్య నా గురువని చెప్పుకోడానికి ఎంతో గర్విస్తున్నాను. 1947లో 'జైభారత్'లో ఆయనతో పనిచేసే మహద్భాగ్యం కలగడమే గాకుండా మా వివాహాన్ని (వర్ణాంతరం) ఆయన చేతుల మీదుగా జరిపించడం జీవితంలో మరపురాని సంఘటన.

### 11. శ్రీ పత్తివాడ సూర్యనారాయణ (మాజీ డిప్యూటీ కమీషనర్, సేల్సు టాక్సు):

నా జీవితంలో ఉద్యోగంలో ఉన్నతి పొందిన దానికంటె ఆయన సహచర్య భాగ్యమే మిన్న అని భావిస్తాను. నావివాహం వారి ఆశీస్సులతో జరగడం రచనా వ్యాసంగంలో వెన్ను దట్టి ప్రోత్సహించడం – మరువరాని మధురసంఘటనలు.

### 12. శ్రీ మద్దూరి జయరామ్ (కుమారుడు):

మాతండ్రిగారికి ఎలాటి స్థిర చరాస్తులు లేవు. రాజకీయ బాధితులకు కేటాయించే భూమికోసం ఆయన దరఖాస్తు చేయలేదు సరికదా! "ప్రభుత్వం ఇచ్చే ఐదెకరాల భూమికంటే ప్రజలు అభిమానించి సన్మానిస్తూ యిచ్చే రెండు రూపాయల పూలదండ, ఐదు రూపాయల శాలువా ఎంతో విలువైనవిగా నేను భావిస్తాను" అని పలుసార్లు చెబుతూ వుండేవారు. ఆయన మరణానికి ఒక సంవత్సరం ముందు నన్ను యూనివర్సిటీలో చేర్పించారు. కుటుంబం కంటే దేశసేవ ఆయనకు ప్రాణప్రదంగా వుండేది.

★ ★ ★

*అనుబంధం-1:*

# అన్నపూర్ణయ్య నడిపిన పత్రికలు

ఆంధ్రదేశంలో తొలి వామపక్ష పత్రిక రాజమండ్రి నుండి మద్దూరి వెలువరించిన నవశక్తి

**NAVASAKTI** Telugu Weekly




సాలు చందా 3-0-0

సంపుటం ౧.

[redacted] యుద్ధం వస్తే?  Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్ర రాష్ట్ర ... సోషలిస్టు పార్టీ పత్రిక

| సంపుటం 1 | బుధవారము 27-7-38 బెజవాడ | సంచిక 31 |
|---|---|---|

మద్దూరి స్వయంగా స్థాపించిన నవశక్తి తరువాత విజయవాడకు మారడం
సంపాదకవర్గం ఏర్పడటం సోషలిస్టు పార్టీ పత్రిక అని ప్రకటించడం గమనార్హం

Regd. M. No 4876

# జయ్ భారత్

సోషలిస్టు వారపత్రిక

సంపాదకుడు: మద్దూరి అన్నపూర్ణయ్య

సహాయ సంపాదకుడు: యర్రమిల్లి నరసింహారావు

సంపుటము 1 — రాజమహేంద్రవరము, బుధవారం, ఫిబ్రవరి 1948 — సంచిక 25

జయ్‌భారత్

VELUGU, Rajahmundry.



REGD NO. M. 6332

* తెలుగు నాడుకు నూతనవత్సర కానుక *

"వెలుగు" ఉగాది ప్రత్యేక సంచిక

హెచ్చు పేజీలతో వెలువడే 'వెలుగు' ఉగాది ప్రత్యేక సంచిక ప్రసిద్ధ రచయితల రచనలతోను, సుందర చిత్రాలతోనూ, అనేక నూతన విషయాలతోను వె... రానున్నది.

* ప్రకటన దారులకిదొక మహదవకాశం *

— మేనేజర్

సంపాదకుడు:— మద్దూరి అన్నపూర్ణయ్య

విడి ప్రతి : 0-2-0

* స్వతంత్ర వారపత్రిక *

సంపుటి 1 | రాజమహేంద్రవరము, జయవారం 9 మార్చి 1954 | సంచిక 28

వెలుగు

అనుబంధం-2:

# ప్రసంగాలు

(అన్నపూర్ణయ్య కలమేకాదు. కంఠంకూడా వాడివేడి అని చాటిన మూడు ప్రసంగాలు 'నవశక్తి' నుండి గ్రహింపబడినాయి)

## I

1938 జనవరిలో జరిగిన తమిళనాడు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అధ్యక్షోపన్యాసంలోని భాగాలు.

"పేరే సూచించుచున్నట్లు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కాంగ్రెసులో నొకభాగం. సామ్రాజ్య ప్రతికూల పోరాటం బలపరచడం కాంగ్రెసును సామ్రాజ్య వ్యతిరేక సంస్థ గావించుటయే ఆశయమని పార్టీ నిర్మాణాన్ని వీక్షించిన ప్రతివారికి తెలుసు. మన నిర్మాణ కార్యక్రమం - అణచివేయబడిన దోచుకోబడుచున్న ప్రజలకు కర్షకుల కార్మికుల యువకుల విద్యార్థుల స్త్రీల సంఘాలు నిర్మించి వారి హక్కులకొరకు పోరాటం. మన దేశంలో ప్రధాన రాజకీయ సంస్థ కాంగ్రెసు. స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపుతున్నది. కాంగ్రెసు తీర్మానాలకు మనం బద్ధులం. కాని మనము దానిని, తీవ్ర కార్యక్రమము అవలంబించి సరియైన సామ్రాజ్య ప్రతికూల సంస్థ కావాలని కోరుతున్నాం. ప్రజాస్వామ్యాన్ని కష్టజీవుల సంఘటన చేయాలంటున్నాం ఎందువలన! వారే స్వాతంత్రోద్యమంలో హృదయపూర్వకంగా సర్వం త్యజించి పాల్గొంటారు. స్వాతంత్ర్య ఉద్యమంలో వారే ఎక్కువలాభం పొందుతారు. అట్టి కష్టజీవులెవరు? కర్షకులు, కార్మికులు, నిరుద్యోగులైన మధ్యతరగతులు. మనము సోషలిజం బోధించడానికి రెండో కారణం మనము అవసరపడినప్పుడు అధికారం భారతీయుల పరమైనప్పుడు - శక్తియుక్తి గలిగిన పై తరగతులవారు - ప్రజాస్వామ్యాన్ని మోసపుచ్చకుండా ఖబర్దారీ చేయుటకొరకు. చైనాలోవలె స్వాతంత్ర్యం కొరకు పోరాడిన కష్టజీవులకు అధికారంలో భాగంలేకుండా చేయనివ్వకుండుటకు."

ఫ్రంట్ దృష్టితో మెలగుచున్న నాయకులగు జయప్రకాశ్ సహజానందగార్లను నేను అభినందిస్తున్నాను. తీవ్రవాదులంతా వారిని సమర్థిద్దాం. (నవశక్తి 19-1-38 నుండి)

# II

కృష్ణాజిల్లా యువజన మహాసభ 1938 ఏప్రిల్ 29న తాడిగడపలో జరిగింది. జాతీయ, ఎర్రజెండాలను 'నవశక్తి' సంపాదకులు మద్దూరి అన్నపూర్ణయ్య ఎగురవేశాడు. ఆ సందర్భంగా అన్నపూర్ణయ్య ఇలా ప్రసంగించాడు.

"జాతీయ స్వాతంత్ర్యానికి చిహ్నము జాతీయ జెండా. కార్మిక కర్షక రాజ్యమునకు చిహ్నము ఎర్రజెండా. జాతీయ స్వాతంత్ర్య అధికారము కష్టజీవుల పరమైనపుడు అది కార్మిక కర్షక రాజ్యముగా పరిణమించును. అప్పుడు ఎర్రజెండాయే జాతీయ జెండా యగును. నాడు కాకినాడలో సామ్రాజ్యవాదుల ఏజెంటు బ్రేకన్ జాతీయ జెండాను చూచి చిందులు త్రొక్కెను. నేడు తెనాలిలో కాంగ్రెసు నాయకుడగు డాక్టర్ పట్టాభి "ఎర్రజెండా యున్న చోట అడుగు నిల్పనని వెళ్ళిపోయెను" అన్నపూర్ణయ్యగారు ఆవేశపూరితులై అన్న యీ మాటలకు చప్పట్లు కురిసిపోయెను. ఎర్రజెండా తత్వం వారిని కాంగ్రెసులోనుండి తరుము గొట్టడానికి ఆంధ్రదేశంలో అల్లూరితో బోణి అయిందని అన్నప్పుడు 'సిగ్గు' 'సిగ్గు' అని కేకలు ప్రతిధ్వనించినవి. (నవశక్తి 11–5–39)

# III

1939 జనవరి 30న లంకలకోడేరులో పశ్చిమ గోదావరి జిల్లా రాజకీయ మహాసభలకు మద్దూరి అన్నపూర్ణయ్య అధ్యక్షత వహించారు. ఆయన ప్రసంగం రిపోర్టు.

"ఇది ఒక మండల సభయా చిన్న కాంగ్రెసా! యని భ్రమ కల్గుతోంది, యీ అసంఖ్యాక జనాన్ని చూస్తే. ఇట్టి మహాసభకు అధ్యక్షునిగా నుండు భాగ్యం కల్గినందుకు ధన్యుడను." అన్నపూర్ణయ్యగారన్న పై వాక్యాలు సభలు ఎంత వైభవంగా జరిగాయో చాటుచున్నవి.

రాజమండ్రినుండి అన్నపూర్ణయ్యగారు కమలాదేవి గార్లు బయలుదేరగా నిడదవోలు లోనేవారికి స్వాగతం లభించింది. కమలాదేవి – అన్నపూర్ణయ్యను ప్రశంసిస్తూ "అల్లూరి సీతారామరాజుతో మైత్రి నెరపిన అన్నపూర్ణయ్యా! 'చిచ్చులపిడుగు' తో చిచ్చు పెట్టిన సింగమా! కాంగ్రెసు పత్రికను ఘనంగా నడిపిన కలం నీది. నవశక్తిచే నవశక్తిని రగుల్కొల్ప బూనిన నాయకుడా" అని పేర్కొన్నారు. "కమలాదేవి గారి కోకిలగానం చెరుకువాడవారి చెరుకురస అనువాదం విన్న మీకు నా మాటలు చప్పగా వుంటాయి." అంటూ ప్రారంభించిన అన్నపూర్ణయ్య ఏకబిగని $1\frac{1}{2}$ గంటలు ప్రసంగించారు. బ్రిటిష్ పట్టణం యొక్క స్థితిని గూర్చి కవివర్యుని వర్ణనం వినిపించినప్పుడు చప్పట్లు కురిసిపోయాయి. "ఆ చివర ఆకాశాన్ని అంటుకుంటూ ఉన్న దివ్య సౌధాలలోని ప్రజలు అజీర్ణ బాధచే సోఫాలపై దొర్లడం; ఈ చివర మొండిగోడల యింట్లో కటికనేలపై తన్నుకొనుచున్న అసంఖ్యాకుల చిచ్చు – లండనులోని ఈ భయంకర దృశ్యాన్ని అనుపమ వాగ్ధాటితో వర్ణించారు అన్నపూర్ణయ్యగారు. మంత్రివర్గాలను గూర్చి మాట్లాడుతూ ప్రజలయొక్క విమర్శ

ప్రజాందోళన మంత్రివర్గాలకే బలకరమని నిరూపిస్తూ ఫ్రాంసులో బ్లమ్ ప్రధాని పోయిన వర్షమున నెట్లు ప్రజాందోళన పూర్తిగా ఉపయోగించుకొని శత్రువాడిని చీల్చి చెండాడేడో శలవిచ్చినప్పుడు ఉత్సాహం మిన్నుముట్టింది.

బీహారులోని రైతులు తమకు తీరని నష్టం వాటిల్లినప్పుడు వారంతా సభ చేసి తమ నాయకుడైన స్వామి సహజానందను పిలిస్తే వారిని రాకూడదని నిషేధించడానికి తీవ్రంగా విమర్శించాడు. కాంగ్రెసు సంఘాలిట్లు కంచెయే చేను మేసినట్లు నిరంకుశంగా ప్రవర్తిస్తే పేద రైతులకు దిక్కేమిటి అన్నాడు. “ఏడవడానికైనా మనకు హక్కు లేదా!” అని ఉద్రేకంగా అన్నపూర్ణయ్య గారన్నప్పుడు జనానికి బాగా వేడెక్కింది. ఆదినుండి అంతం దాకా ఆ వేడిని నిలబెట్టాడు కామ్రేడ్ అన్నపూర్ణయ్య. (నవశక్తి 9–2–39)

★ ★ ★

అనుబంధం-3:

# కలంచిందులు

## (అన్నపూర్ణయ్య గారు 'అమృతరావు' పేరిట వ్రాసిన వ్యాఖ్యలు)

ఆంధ్రరాష్ట్రమెప్పుడు వస్తుంది. బజారులలోను బస్సులలోనూ రైళ్ళలోనూ యిదే ప్రశ్న. అమధ్య ఢిల్లీ వెళ్ళి పటేలు నుండి కళావారు నెహ్రూనుండి ప్రకాశంగారు ఆంధ్రరాష్ట్రాన్ని మోసుక వచ్చారు.

అయితే గవర్నరెవరు? ప్రధాని యెవరు? అని అప్పుడే కాన్వాసింగ్ బయలుదేరింది. జమీన్ రైతు అప్పుడే ప్రకాశం గారికీ, రంగా గారికీ పోటీ వుంటుందని జోస్యం చెప్పింది. ఇద్దరు చెరొకటి పంచుకొని తుని తగవు చేసికుంటారని శకుని పక్షికూస్తుంది. యుగంధరమంత్రిని నేనుండగానా యిదంతా యని కళావారు కలవర పడుచున్నారట – స్వరాజ్యం అంటేనూ ఆంధ్రరాష్ట్రమంటేను పదవుల పంపకమే కామోసు. (20–8–47)

ఎవరినైనా టోపీ వేయగల వానినే గానీ ఒకరిటోపీలో నేను పడేవాణ్ణికాను – అన్నారు కళాయుగంధర మంత్రి తాడేపల్లిగూడెంలో. అవును. తమ ప్రతిభను తామే డప్పు వాయించి చాటుకోనక్కరలేదు. నాకేమి పదవి అక్కరలేదని ప్రకటించింది తమరే! తరువాత పళ్ళం రాజుకు టోపీపెట్టి గద్దెనెక్కింది తమరే! అదే కదా పాపం పళ్ళం రాజుగారి అనుచరుడు నమ్మయ్య బ్రాహ్మణులు నశించాలి అని కాకినాడ నడివీధులలో నినాదాలిప్పించడానికి కారణం. (27–8–47)

"ఒమాండూరు వారు కూడా తెలుగువారే! అందుచేత ప్రధానిగా ప్రకాశంగారు లేకపోయినా ఫరవాలేదు" అని ఊరడించారు. శ్రీ కళావారు పోలమూరులో. దానికింకొకమాట కూడా చేర్చాలి. రెడ్డిగారు మంచి భూ ప్రదాతలు కూడాను. అందుచేతనే యీ సిసలైన తెలుగు మంత్రి నెల్లూరు వరకు తిరుపతి వరకు దానపట్టా వ్రాసి అరవల కిచ్చేస్తామన్నారు. ఇప్పుడు కళావారిచ్చిన సర్టిఫికేట్ వల్ల వారు మరింత పొంగి పోయి అమలాపురం వరకు కూడా యిచ్చేసి తన తెనుగుతనాన్ని సార్ధకం చేసుకుంటే ఆశ్చర్యం వుండదు."

మద్రాసు నగరంలో తన విద్యాశాఖ మంత్రియైన శ్రీ అవినాశ లింగంచెట్టిగారు తెలుగు తీయించేసి తమిళమే నేర్చుకోవాలని శాసించాడు. రెడ్డిగారి మీద – తెనుగుదనంలో సొడ్డు వేయగల వారెవ్వరు! (28–8–47)

మనలను ఏలుతూ ఉన్నది మన తెలుగు వాడైన ఒమాండూర్ రెడ్డియార్‌గారే అని కళావారు పోలమూరులో చెప్పినప్పటి నుండి రెడ్డి యార్ గారి తెనుగుదనం మంచి బాగా తైతక్కలాడుతోంది. మద్రాసులో తెలుగు రేషన్‌కార్డులు లేక తెలుగు

బీద ప్రజలు తల్లడిల్లిపోతున్నారు. ఇదివరలో మద్రాసులో ఇంగ్లీషు తెలుగు తమిళం యీ మూడు భాషలలో రేషన్ కార్డులు అచ్చు వేశారు. ఇప్పుడు తెలుగు కార్డులు లేవు. తమిళములోనే. కడుపు కాళ్ళు పట్టుకొని ఎవ్వరి చేతనో వ్రాయించుకోవాలి. మదరాసు అరవలదే అని రుజువు చేయడానికి తెలుగు ప్రధాని రెడ్డియార్ చేస్తున్న కపట నాటకాన్ని గ్రహించలేక కళావారింక రెడ్డియార్ తెలుగుదనాన్ని ప్రశంసించడమెందుకో... (3-9-1947)

గవర్నరుగా విరమించిన తర్వాత ఇక రాజకీయాలలోకి మరి రాను అన్నారు శ్రీరాజాజీ మద్రాసు కార్పొరేషన్ వారి సన్మానసభలో. అయితే దక్షిణ దేశప్రజలకు స్నేహితునిగా మార్గదర్శకునిగా గురువుగా వుండక మాననని కూడా శలవిచ్చారు. ఇదివరలో ఒకమారు రాజకీయాల నుండి విరమించి భగవద్గీతాకాలక్షేపం చేశారు. మళ్ళీ గభాలున రంగంలోకి దిగి మద్రాసు ప్రధాని అయ్యారు. గీత ముట్టుకొనేసరికి గద్దె జ్ఞాపకమొస్తుంది రాజాజీకి.

కాంగ్రెసు పావలా సభ్యుడు కాకుండా గాంధీ రాజకీయము నడిపిస్తున్నాడు. రంగం మీదలేకుండనే రాజకీయాలు నడిపిస్తాడన్నమాట. రాజాజీ తెరచాటు రాజకీయాల ముచ్చట్లు చూస్తామన్నమాట మనం. (15-10-47)

కళా వెంకట్రావుకు గురువును వదలివేసే అలవాటు మొదటినుండి సంప్రదాయికంగానే వస్తూ వుందిగా!

సాంబమూర్తి గారిని తపస్సులోకి పంపేశాడు. ప్రకాశంగారిని దేశాటనం చేసుకోమన్నాడు. పట్టాభిగారిని బందరో లేక ఉత్తర హిందూస్తానమో చూసుకోమంటే తన పని పూర్తి అవుతుంది. గురువులకు పంగనామాలు పెట్టిన వారంతా తన చుట్టూనే వున్నారని తెలిసికోకపోతే అదేగతి పడుతుందని మాత్రం తెలిసికోవాలి. (19-11-47)

'గాంధీజీ సర్వోదయ సంప్రదాయం, నేతాజీ జాతీయ సార్వజనీన సాంప్రదాయం, ప్రజాస్వామిక సోషలిస్టు సంప్రదాయం నేడు మిళితమయిపోయి ఈ మేలు కలయిక నుండి ఒక మహాశక్తి ఉద్భవిస్తుంది. ఈ మూడు సంప్రదాయాల వెనుక ఒకే లక్ష్యం ఒకే గమ్యం. ఒకే ఉన్నత సిద్ధాంతం ఒకే తత్త్వం వున్నాయని నేడు మనం గ్రహించినందుకే యీ సుందర సమైక్యాన్ని సాధించుకున్నాం. ఈ సమ్మేళనం మనకు మనదేశానికి మహోపకారం చేస్తుందనటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు.' గాంధీ బోసుల గురించి జయప్రకాశ్ చేసిన ప్రశంస అద్వితీయమైనది. నిజంగా దేశ స్వాతంత్ర్యాన్ని సాధించిన వారు భారత ప్రజలే అయినా వారిని ప్రథమంగా మేలు కొల్పినవాడు లోకమాన్య బాలగంగాధర తిలక్. స్వరాజ్యం నా జన్మహక్కు. దానిని నేనుపొంది తీరెదను అని ఎలుగెత్తి చాటి అనేక కష్టములనుభవించిన దేశభక్తుడు ఆయన. అనంతరం గాంధీ, బోసు జయప్రకాశ్‌లు జగజ్జేగీయమానంగా సాగించారు. మహాత్ముని సత్యాగ్రహము, నేతాజీ అజాద్‌హింద్‌ఫౌజ్ యుద్ధము, జయప్రకాశ్ ఆగష్టు విప్లవము స్వాతంత్ర్య సిద్ధికి మూలకారణాలు. తిలక్ గాంధీ బోసు జయప్రకాశ్‌ల

నామాలు భారత స్వాతంత్ర్య చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడాలి.

'వెలుగు'(27–7–53)

ఆచార్య రంగా ఎప్పుడూ తృతీయ పంథా మనిషి. ఊరంతా ఒకదారి ఉలిపికట్టె దొకదారి అన్నట్లు ప్రజాస్వామిక పక్షాలన్నీ కలసి కర్నూలు రాజధానిగా నిర్ణయిస్తే, మళ్లా తిరుపతంటారు మన రంగాజీ! అప్పుడు తాను కాశ్మీరులో వుండి యిప్పుడు దానిని తిరుగదోడడమెందుకు?

తన పార్టీ వారిచే లెంపలు వాయింపించడమెందుకో! తానేమైన తిరుపతి వెంకటేశ్వర స్వామికి, మహాప్రభో! నీ సన్నిధికే తెస్తాను రాజధాని! యని మొక్కుకున్నాడా! "రాజధాని నా సన్నిధికి తెచ్చి నన్ను అపవిత్రం చెయ్యకండి" అని ఆయన మొరపెట్టుకొన్నాడే! పాపం ఎండోమెంటు బోర్డువారు దేవుడి తరఫున అలా అర్జీ పెట్టుకున్నారే! కర్నూలుకు రాయలసీమ ప్రజలే సుముఖులుగా లేరనే కుంటిసాకు ఎందుకు! తన కృషిక్ లోక్ పార్టీ వారు, కమ్యూనిస్టులు తప్ప మిగతా రాయలసీమ సభ్యులంతా కర్నూలుకే ఓటు చేస్తామంటూన్నారే! ఎలాగో మూడు ప్రజాస్వామిక పక్షాలు కలిశాయని రంగా గారి దుగ్ధా! (28–7–53)

భూసంస్కరణలు కావాలని ఆందోళన చేసే యీ విప్లవ రోజులలో దున్నే వారికి భూమి యివ్వాలి కాని, రాజకీయ బాధితు డైనంతమాత్రమాన కౌలు కిచ్చే వారికి భూమి ఎంత మాత్రం యివ్వకూడదు. ఇది ముఖ్యముగా గమనించ దగిన విషయం. వ్యవసాయం వల్ల జీవనం చేయ సంకల్పించిన రాజకీయ బాధితులు పలువురను చేర్చి వారికి మొత్తం మీద యింత భూఖండాన్ని కేటాయించి సహకార సమిష్టి వ్యవసాయ క్షేత్రమును నెలకొల్పి పనిచేయించుట మంచిది. వారి కవసరమగు పెట్టుబడి రుణము స్వల్ప వడ్డీతో అడ్వాన్సు చేయుట కూడా మంచిది. ఇక వ్యవసాయము చేయలేని రాజకీయ బాధితులకు ఇతర మార్గములలో తోడ్పడవలెను. గృహవసతి లేని వారికి అట్టి సౌకర్యము కలుగ జేయవలెను. వారి పిల్లలకు ఉన్నత విద్య చెప్పించుటకు ఏర్పాటు చేయవచ్చును. వృద్ధులకు, వితంతువులకు పింఛను యివ్వ వలెను. అవసరమైన ప్రత్యేక కేసులలో రొక్కం మొత్తం ఇచ్చి వృత్తుల నేర్పాటు చేయవచ్చును. (2–2–54)

దేశంలో ఎన్ని రాజకీయ కక్షలున్నవో విద్యార్థులలో వాటి అనుబంధ సంస్థలు అన్ని బయలుదేరుట శోచనీయం. విద్యార్థి ఫెడరేషను కమ్యూనిస్టుల జేబు సంస్థయనుట జగమెరిగిన సత్యం. రాష్ట్ర విద్యార్థి సమ్మేళనము కృషిక్ లోక్ పార్టీ అనుబంధ సంస్థగా అవతరించింది. ఇటీవల ఆర్.యస్.యస్. వారు కూడా విద్యార్థి పరిషత్తును స్థాపించిరి. డెమోక్రాటిక్ విద్యార్థి యూనియన్ ఆంధ్రలో ఇటీవల విపరీతముగా వ్యాపించినది. ఇందు సోషలిస్టు భావాలు కలిగినవారు హెచ్చుమంది వుండుటను పురస్కరించుకొని దానిని సోషలిస్టు అనుబంధ సంస్థగా తయారు చేయుటకు కొందరు సోషలిస్టు నాయకులు ప్రయత్నించుచున్నట్లు వినబడుచున్నది. కాని తదధ్యక్షుడైన శ్రీ చైతన్య తాను స్వయముగా సోషలిస్టు అయినప్పటికీ డెమోక్రాటిక్ స్టూడెంట్సు

యూనియన్ సోషలిస్టు అనుబంధ సంస్థగా చేయుటకు నిరాకరించినట్లు వినుటకు సంతోషించుచున్నాము. ఆంధ్ర రాష్ట్రోద్యమంలో డెమోక్రాటిక్ స్టూడెంట్స్ యూనియన్ విద్యార్థులు వహించిన పాత్ర అద్వితీయమైనది. (1-6-54)

డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య గారి గవర్నరుగిరి రెండు మూడు మాసాలలోనే పరిసమాప్తి అవుతుందట. అందరూ అయిదేళ్ళ గడువు పూర్తి అయ్యే గవర్నరు గిరి మన పట్టాభికి రెండేళ్ళలో పూర్తి కావడమేమిటి అంటారా? ఉద్యోగపు ఉత్తర్వులోనే ఆఖరునిముషాన రెండేళ్ళు మాత్రమే యని వేశారని వినికిడి. ఇక పొడిగించే అవకాశం లేదు. గురువు గారి దర్శనం చేసుకొని గవర్నరు గిరి అంతు చూచి రావడానికి శ్రీకళావారు పచ్‌మఢ్రి (గవర్నరు వేసవి కేంద్రం) వెళ్ళారు. తిరిగి వచ్చి ఆంధ్రకేసరి ప్రధానిత్వపు అంతును కూడా చూచుటకు కాస్త చల్లగాలిని పచ్‌మఢ్రిలో పోసుకొని కొత్త బలంతో తిరిగి వస్తారు కాబోలు. 'నీరా' పై పోతూ పోతూ వారిచ్చిన పత్రికా ప్రకటనకు అర్థమేమిటి! (8-6-54)

★ ★ ★

# అన్నపూర్ణయ్య జైలు గీతాలు

## వీరపత్ని

కోరిన కట్నంబు మేరమీరిన దంచు
వేరొక వరునికై వెదకుచున్న
నాన్నను వారించి నా హస్తమును గోరి
ప్రేమ పెండ్లికి బాటవేసినావు

ముస్తఫాలీఖాను ముష్కరలారీకి
పురుషులు కుందలై పారుచుండ
చెలికత్తె లిరువురన్ చెచ్చరదోడ్కొని
స్వాతంత్ర్య దివసంబు జరిపినావు

నాడు పట్టణఖ్యాతిని నిలిపినావు
ఆరుమాసాల శిక్షను అనుభవించి
పతికి పేరు పెంచిన 'వీరపత్ని' వంచు
ఆంధ్రలోకపు మన్నన లందినావు॥

చేతకాసులేదు చెరసాలలో భర్త
పుష్కరంబుపాటు సుక్కినుండె
ఇంట యింతి నీవు వేదనతో నెంతొ
ఇంకినావొ భువిని యేరికెరుక

పిల్ల పెళ్ళికూడ పెనిమిటి లేకనే
నీవె చేయవలసె నీలవేణి
జనుల సాయమైన ధనసహాయమయిన
లేకపోయె నీకు లేమికల్గె

వలదు నా బాధ పరమశత్రువు కైన
పడితివిన్ని పాట్లు నాదువలన
దొసగులెన్నియొ చేసిన దుష్టమతిని
నేరమెంచకక్షమియించు నెలతనన్ను

క్రూరవిధి నిన్ను నన్వీడి కోరి మ్రింగె
బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబనగుచు
బొంగడే నీ భర్త క్రుంగడే సామ్రాజ్య
వాదులు క్రోధంబు బాధకెపుడు

కార్మికకర్షక ధార్మిక సేవల
కలిమిలేముల రెంటిని తలపబోడు
నియితిగా నీ చిన్ని జయరాముజెండాకు
జేజేలు చెప్పెడు రోజువచ్చు

అజ్ఞాత నిష్కామమైన నాత్యాగంబు
సార్థకంబుగాని వ్యర్థమవదు
ప్రియుని గుండెలో చిచ్చు బెట్టినావు
చెలియ! భరియింపజాల నీవేడి నేను
స్వేచ్ఛ హోమమునందున జేర్చివైతు
భరతదాస్యము భస్మమై తోచునిజము
ఆత్మశాంతితో నలరారువీ వనఘ చరిత

(అన్నపూర్ణయ్య భార్యస్మృతి)

☆ ☆ ☆

## జేజేలు సోవియట్ దేశమా

ఎర్రజండా క్రింద
ఏలుబడి సాగించు
సోవియెట్ దేశమా! జేజేలు

యూరపునంతాను
అరచేత బెట్టుకొని
ఆడించు హిట్లరును
ఓడించు చున్నట్టి
ఎర్ర సైన్యమా! నీకు జోహారు

బోల్షి విజము బూచి
పూడ్చి వేస్తానంటు
బీరాలు పల్కిన బ్రిటను నీ నేస్తంబు
గణియించి పెడుతుంది జేజేలు

పోలెండు పొలములో
పేదరైతుల కిచ్చి
పీడిత దేశాల కాశ కల్పించిన
సోవియెట్ దేశ మా జేజేలు

ఎవడడ్డు నాకు
ఎదురేది నాకంచు
విర్రవీగిన హిట్లు
రెదురాడలేకుండ
నీ దేశ మందుండు
కార్మిక కర్షకుల్
నీకండయై జేరి
బలము నీకిస్తుండ
భయములేదంటూ నీవభయమిస్తున్నావు
పుణ్యభూమీ నీకు జేజేలు

ఫాసిస్టు ఇటలీయు
మిలిటరీ జాపాను
హిట్లరుకు తోడుగా
నిల్చియున్నను గూడ
జయము నీకే సుమ్ము
జయము నిశ్చయము.

(15–6–42 వేలూరు జైలు)

☆ ☆ ☆

## ఎంతకాలం?

ఎంతకాలమీదాస్యమునీకు
కార్మిక సోదర సెప్పవటోయ్
ఎంతకాలమీ నరకబాధలు
కర్షక సోదర తెల్పవటోయ్

ధనికస్వాముల దాహతృష్ణల
హద్దెక్కడ యని అడగవటోయ్
చెమటోడ్చి సిరిసంపదలెల్ల
సృష్టి సేయునది ఎవ్వడటోయ్

కాలు మీదకాలేసి కాంతలతో
కులుకు కూళయది యెవ్వడటోయ్
చిత్ర వర్ణముల సిల్కు వలువల
నేయు వాడది యెవ్వడటోయ్

చీటు గోటుగా నిక్కుచునీల్గుచు
యెండకు ఎండి వానకు నాని
పంటలు నిచ్చు వాడెవడోయ్
కండ పెంచుకొని కావరంబుతో
విరగబడునది ఎవ్వడటోయ్

లోకమంతయు సుఖమొందుటకు
కాయకష్టములు ఎవ్వరివోయ్
రెక్కలాడిన డొక్క ఆడనిది
ఈలోకములో నెవ్వరికోయ్
అఖిల జగత్తుకు ఆధారమవని
తెలియజాలని బేలవటోయ్!

అంగటిలోను అన్నీ వున్నా
అల్లుడి నోట్లో శనిగాడోయ్
పసికందులకైనా గ్రుక్కెడు పాలను
పోయలేని బ్రతుకెందులకోయ్!

అజ్ఞానముతో అణగి యుండుట
ఎంతకాలమిక సెప్పవటోయ్
లెమ్ము లెమ్ము నీ శక్తినెరుంగుము
దోపిడి దొంగల తోలెయ్యవోయ్

కార్మిక కర్షక సంఘశక్తికి
ఎదురు లేదని ఎరుగవటోయ్
మేలుకొనుము, నీ మాతృదేశమును
ఏలుకొనగ వలెరా! రావోయ్.

(వేలూరు 27–10–41)

☆ ☆ ☆

## జోహారులందుకో జోదుమా లెనిన్

కార్మిక కర్షక శక్తికి యురవై
స్వతంత్ర జాతుల సమ్మేళనమై
ఎఱ్ఱ సైన్య రణరంగ భూమియై
అఖిల లోకపు ఆశాలతయై
శోభ జిమ్మెను సోవియెట్ దేశము
దివ్య దీప్తితో తేజరిల్లగా
మరణ మెక్కడ నీకు మాదు లెనిను

అంటరానిదా రష్యా యంచు
ఆడిన మాటల నన్నిటి మరచి
బొల్షివిజము పెను భూతమటంచు
బొంకిన బూర్జువ నాయకులెల్ల
హిట్లరు ధాటికి తాళజాలక
సోవియెట్‌కు జోహారనిరి
సంధి జేసుకొని శరణజొచ్చిరి
అకృతము కాదు మాలెనిన్ అమరజీవి

అఖిల జగమున అన్నాతురులు
సకల విశ్వమున శ్రమ జీవులును
సామ్యవాదులకు బాసట నిల్చి
కార్మిక కర్షక జీవన జ్యోతిని
ఆర్పివేయ నుంకించినట్టి
తుచ్ఛఫాసిజము తుదముట్టింప
నడుములు కట్టి నిల్చి పోరగా
చావడు మాదు చక్కని లెనిను

దివ్యతారయై దివి యంతటను
ఆ చంద్రార్కము వెలిగి తీరును
జోహారులందుకో జోదు మా లెనిను
దివ్యతారయై దివియంతటను
ఆచంద్రార్కము వెలిగి తీరును
జోహారులందుకో జోదు మాలెనిను

పాతాళములేని సంద్రము మధ్య
మేరువులో ధగ ధగ మెరయును
చుట్టూనున్న ధనిక దేశముల

ఒరపిడి కెంతో తట్టుకొనుచును
చెక్కు చెదరక నిల్చి యుండి
విప్లవ చిచ్చును వెల్గించేటి
సోవియెట్ దేశపు శోభయెనీకు
స్మారక చిహ్నము శాశ్వత సౌధము
చీకూచింత లేక నిదురపోక లెనిను
ఫాసిజంబును పాతర వేసి
ఇంపీర్లిజయపు దుంపను తెంపి
స్వేచ్ఛా బావుటా చిందులు తొక్క
దిక్కులు లేకను సకల జనాలు
శాంతి సౌఖ్యముల నలరారుదినమె
వచ్చుచున్నది మక్కువ వెలయ
నీదు చరితము సార్ధకమౌను
నిక్కము భావిని నీదు నామము
తిరముగ నిల్చి తేజరిల్లును
సామ్యవాదము రెక్కలు గట్టి
జగతిని గూరుచు శాంతిని
శాశ్వతంబుగా స్థాపన జేయును
జోహారులందుకో జోదు మాలెనిను.

సూర్యచంద్రులు చుక్కలు కూడ
శోభను దక్కి సుక్కునదేమొ
తెలియదు కాని ప్రళయకాలము
వచ్చిన కూడ నీదు నామము
మాయదు భువిని మాన్య మెప్పుడు
జేజేలనందుకో జగదేక వీరా!
జోహారులందుకో! జోదుమా లెనిన్॥

☆ ☆ ☆

## జోహార్ - జోహార్

కూలివాళ్ళము మేము – కూలి వాళ్ళము మేము
కూడుగుడ్డా లేక కూలిపోతున్నాము
సోషాలిజము వచ్చె జోహారు కొట్టండి
జోగూల బోగాలు సూర్ణమైపోతాయి – ॥కూలి॥
ఆడోళ్ళ కష్టాలు ఆకరైపోతాయి
అన్నాయము లన్ని అడుగంటిపోతాయి – ॥కూలి॥

జాతి భేదాలన్ని సస్తాయి సస్తాయి
కులము గిలమూ లన్ని గోతిలో పడతాయి - ॥కూలి॥
ఆస్తి పాస్తూలన్ని అందరీ వౌతాయి
అందరు సమముగ అనుభవించొచ్చండి - ॥కూలి॥
కొలులిచ్చే బాబు కాల్మీద కాలేసి
కులికేటి కామందు కూలిపోతాడండి - ॥కూలి॥
పని సేయు వాడేను ఫలమందుకుంటాడు
పాటుపడనీ వాణ్ణి పస్తుండ పెడతాము - ॥కూలి॥
పైరులూ పంటలూ పండించు వారికై
భూదేవి అంతాను బుక్తమై పోతాది - ॥కూలి॥
శక్తి కొలదీ పని రక్తిగా పుచ్చూక
అవసరము కొద్దీ అనుబావిస్తాము - ॥కూలి॥
సేతి నిండా పనీ నీతిగా కల్పించి
ఆకలీ సిచ్చునూ ఆర్పియేస్తామండి - ॥కూలి॥
సామ్యవాదము సొమ్మె మెచటుబాబు
బూలోకము నందు ఆలోశనది యేల - ॥కూలి॥

★ ★ ★

# మద్దూరి అన్నపూర్ణయ్య జీవితంలో ముఖ్యఘట్టాలు

| | | |
|---|---|---|
| జననం | ... | 20.3.1899 |
| తండ్రి మృతి | ... | 7.5.1912 |
| వివాహం | ... | 7.6.1919 |
| సహాయనిరాకరణ ఉద్యమ ప్రవేశం | ... | 2.12.1920 |
| "కాంగ్రెసు" పత్రిక స్థాపన | ... | 29.3.1922 |
| తొలిసారి అరెస్టు | ... | 23.1.1923 |
| విడుదల | ... | 13.6.1924 |
| సీతానగర ఆశ్రమప్రవేశం | ... | 7.10.1925 |
| కుమార్తె జననం | ... | 8.2.1927 |
| తిరిగి అరెస్టు | ... | 13.7.1929 |
| బి.క్లాసు ఖైదీగా మార్పు | ... | 3.7.1930 |
| విడుదల | ... | 26.9.1931 |
| ఆశ్రమంపై దాడి అరెస్టు | ... | 19.5.1932 |
| విడుదల | ... | 15.2.1935 |
| ఆశ్రమం నుండి బయటకు రాక | ... | 7.7.1935 |
| కుమారుని జననం | ... | 10.4.1937 |
| "నవశక్తి" పత్రిక ప్రారంభం | ... | 15.12.1937 |
| ఫార్వర్డు బ్లాకు ప్రవేశం | ... | 28.8.1939 |
| డిటెన్యూగా నిర్బంధం | ... | 6.4.1940 |
| విడుదల | ... | జూన్ 1945 |
| "జయభారత్" పత్రిక స్థాపన | ... | 15.8.1947 |
| "వెలుగు" పత్రిక స్థాపన | ... | 10.7.1953 |
| రాజకీయ సన్యాసం | ... | 2.12.1953 |
| కాలధర్మం | ... | 10.9.1954 |